ఆత్రేయసాహితి

ఏడవ సంపుటం

ప్రమోదూత - ఉగాది

1990

ముఖపత్రం

గంగాధర్

ముద్రణ

క్రాంతి ప్రెస్,

మదరాసు-1

ప్రచురణ

మనస్విని

పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్

ఎ సి 4, సెకండ్ ఎవెన్యూ

అన్నానగర్

మదరాసు - 600 040

లేక

నవోదయా పబ్లిషర్స్

కారల్‌మార్క్స్ రోడ్

విజయవాడ - 520 002

వెల

ఏడు సంపుటాలు ( సెట్ )

రూ. 225/-

# ఆత్రేయసాహిత్యం

ఏడవ సంపుటం

## కదంబం

సంపాదకుడు
కొంగర జగ్గయ్య
సహసంపాదకుడు
పైడిపాల



మనస్విని
పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్
మదరాసు

# ఆత్రేయ గురించి ....

| | |
|---|---|
| అసలు పేరు | కిళాంబి వేంకట నరసింహాచార్యులు |
| కలం పేరు | పేరులోని 'ఆచార్య' + గోత్రంలోని 'ఆత్రేయ' వెరసి ఆచార్య ఆత్రేయ |
| పుట్టింది | 7-5-1921 న నెల్లూరు జిల్లా సూళ్లూరుపేట తాలూకా మంగళంపాడు గ్రామంలో |
| పెరిగింది | ప్రాథమిక విద్యాభ్యాసం వరకూ, స్వగ్రామమైన 'ఉచ్చూరు'లో తరువాత మేనమామల ఇంట్లో— |
| తల్లిదండ్రులు | శ్రీమతి సీతమ్మ శ్రీ కృష్ణమాచార్యులు |
| చదువు | ఎస్ ఎస్ ఎల్ సి వరకు చిత్తూరులో — ఇంటర్మీడియెట్ రాయ వెల్లూరులోని ఊరీస్ కళాశాలలో — టీచర్స్ ట్రెయినింగ్ చిత్తూరులో |
| వివాహం | 1940 లో శ్రీమతి పద్మావతితో |
| రాజకీయాలు | 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళటం, 1955 లో కమ్యూనిస్ట్ పార్టీకోసం ప్రచార ప్రదర్శన లివ్వటం |
| ఉద్యోగాలు | నెల్లూరు మున్సిఫ్ కోర్టులోనూ తిరుత్తణి సెటిల్‌మెంట్ ఆఫీసులోనూ గుమాస్తాగానూ - 'జమీన్ రైతు' పత్రికలో సహాయ సంపాదకునిగానూ - ఆంధ్ర నాటక కళాపరిషత్తులో పెతసకార్యదర్శిగానూ |
| రచనలు | పోయినవి పోగా పది నాటకాలూ, పదిహేను నాటికలూ సుమారు 400 చిత్రాలకు మాటలూ, పాటలూ పద్య కవితయూ |
| బిరుదులు | ఇచ్చినవి మరచిపోగా, జనం నోళ్ళలో 'మనసుకవి', 1989 మే లో సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి డాక్టరేట్ |
| నిర్యాణం | 13-9-1989 బుధవారం రాత్రి 10 గం॥కు మదరాసులో |

# మా మాట

శ్రీ ఆత్రేయ ఒక నాటకకర్తగా, సినిమా రచయితగా మాత్రమే ఆంధ్రదేశానికి తెలుసు కాని ఆయన ఛందోబద్ధమైన సంప్రదాయ కవిత్వం కూడా వ్రాశాడనీ, చాలా బాగా వ్రాశాడనీ చాలామందికి తెలియదు విశ్వనాథ సత్యనారాయణగారి వంటి కవి సమ్రాట్టులే ఆయన పద్యవిద్యకు ముగ్ధులైనారంటే — ఆయన ప్రతిభ ఎంతటిదో గ్రహించవచ్చు

ఆయన సశేషంగా వ్రాసుకొన్న పద్యాత్మకమైన 'ఆత్మకథ' ఈ సంపుటానికి తలమానికం ఆయన ఇతర పద్యరచనలనుకూడా, అందిన మేరకు, ఇందులో చేర్చాం సినిమాలకు కాక ఇతరత్రా ఆయన వ్రాసిన గేయాలూ సూక్తులూ, వివిధ సమస్యలపై ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలూ, శ్రీ ఆత్రేయలో ఎంత సున్నితమైన హాస్యం, చమత్కారం దాగి ఉన్నదో తెలిపే ఆయన ఛలోక్తులు - మొదలైనవన్నీ ఇందులో చోటుచేసుకున్నై బహుముఖమైన శ్రీ ఆత్రేయ వ్యక్తిత్వానికి ఇవన్నీ అద్దం పడతాయనడంలో సందేహంలేదు

ఈ ఏడవ సంపుటం 'కదంబం' తో 'ఆత్రేయ సాహితి' పూర్తి అవుతుంది ఈ ప్రచురణతో శ్రీ ఆత్రేయ సాహిత్య స్వరూపాన్ని సమగ్రంగా మీ ముందు ఉంచగలిగామనీ, పాఠకలోకాన్ని తృప్తిపరచగలిగామనీ విశ్వసిస్తున్నాం ఈ బృహత్ కార్యనిర్వహణలో అన్నివిధాలా మాకు తోడ్పడిన అన్ని వర్గాలవారికీ మరొకసారి మనఃపూర్వక కృతజ్ఞత నివేదించుకుంటున్నాం సెలవు

మదరాసు,
ప్రమోదూత - ఉగాది
27-3-1990

కొంగర జగ్గయ్య
సంపాదకుడు



మనస్విని
పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్
మదరాసు

## ఈ సంపుటంలో...

# ధన్యవాదాలు :

ఈ సంపుటంలోని వస్తుసేకరణకై
మాకు తోడ్పడిన

టి. వెంకటపతిరాజు గారికి
(విజయవాడ)

డాక్టర్ జయధీర్ తిరుమలరావు గారికి
(హైదరాబాదు)

కుమారి కె బి శ్రీలక్ష్మి గారికి
(హిందూపూర్)

కె పి రావు గారికి
(మదరాసు)

శ్రీమతి జి నిర్మల గారికి
(సినీనటి, మదరాసు)

'కళాసాగర్' సాంస్కృతికసంస్థ వారికి
(మదరాసు)



ఆత్రేయ సాహితి సంకలనంలో
మాతోపాటు నిబద్ధతతో
పనిచేసిన సహాయకులు

శ్రీ గజరావు వెంకటేశ్వరరావుకి
శ్రీ జి రామారావుకి

ఆత్రేయ తన 'ఆత్మకథ'ను అసంపూర్ణంగానే వదిలేసి వెళ్ళిపోయాడు ఎప్పటికప్పుడు పూర్తి చేస్తానంటూనె చెయ్యలేకపోయాడు ఇది పూర్తయి ఉంటే, తెలుగు సాహిత్యంలో మరొక రసాత్మక కావ్యం అవతరించి వుండేదనటం నిస్సందేహం అందుకు ఆనవాలుగా - అసంపూర్ణమైనా - ఈ కావ్యాన్ని పాఠకలోకానికి నివేదిస్తున్నాం

— సం॥

## పీఠిక

శ్రీ యని మొదలిడి సంతన్
శ్రీ యుతమై జయము యశము చెకురుగానన్
శ్రీ యను నక్షరదేవిని
సాయము నర్థించి సేతు సకలార్చలన్!

ఉన్నాడనుకొను వారికి
నున్నా యనుపించు వాని, చోద్యముగా లే
డన్నన్ వారికి కోరక
యెన్నిట సాయమ్ము సేయు నక్రమశీలిన్

అన్నిట తానై యుండియు
కన్నులకున్ కానరాని గారడి వానిన్
అన్నము పెట్టిన దాతను
తన్నెడి దుష్టుని క్షమించు దయగల వానిన్

పుట్టించుట పెంచుట తుద
ముట్టించుట తానె సేయు మూర్తిత్రయునిన్
బిట్టగు ప్రళయము నందున
పెట్టిలె నిదురించ గలుగు నాత్మారామున్

ఇవ్వని వారికి కలిమిని
ఇవ్వగలారలకు లేమి నిచ్చు వివేకిన్
పువ్వున ముల్లిడు రసికుని
నవ్వులు కుటిలుల కొసంగు నటశేఖరునిన్

తరుణి పద దాసులనన్
శిరమున నెక్కించుకొన్న శివునిన్, జిహ్వన్
తిరముగ నిల్పిన బ్రహ్మన్
ఉరమున నిడుకొని భరింపనోపిన విష్ణున్

తెలివిన్ కలుముల చెలితో
కలహించి దరిద్రయైన గర్విష్ఠిన్, రా
జుల కొలువున పెరుగుచు - నీ
వల పెపల కొరకు పోరు ప్రగతి విపంచిన్

దెవరలన్ దేవేరుల
దీవించుండని స్మరించి దీపించు మదిన్
భావాంబరమున శాశ్వత
జీవకళల నింపిన కవిశేఖర గణమున్

తలపోసి వారి కవితా
జలనిధిలో మున్గితేలు సంబరమున, నా
కలవడిన లేత కైతను
మలచెద నీ కావ్యరచన మధురిమ పొందన్

కావ్యమన్న నేమొ కావ్య లక్షణమేమొ
చదువలేదు పెద్ద చదువులేదు
గురువు తొమ్మిదింటి గురువొక్కడే నాకు
వ్యాకరణమన రణబీకరమ్ము

ఎటులో యబ్బెను పద్దెము
హుటు హుటు తడబడక సుంత హొయలుగ చెప్పన్
జటిలముగ నుండ నోపదు
పటువగు వ్యుత్పత్తి లేని పాండితి యగుటన్

# అంకితము

ఈ పున్నెము నా తల్లిది
నా పూర్వులదౌను గాన సమ్రత తోడన్
నా ప్రతిభ కాదు కాఁని
ఈ పాత్రము వారికిత్తు నిహపరగతికై

# యోగ్యతాపత్రము

మహనీయులు మహితాత్ములు
మహానుభావులును లోకమాన్యులు గణ్యుల్
మహితాశయ సాధకు - లి
మ్మహికి శుభంకరులు విశ్వమానవులలఘుల్

చరిత గలవారు, తామె
చరితను సృష్టించ గలుగు సాహసవంతుల్
పరహిత జీవులు, జీవిత
పరమార్థమ్మెరిగినట్టి భవ్యుల్ దివ్యుల్

త్యాగులు నైహిక భోగ వి
రాగులు నిష్కాములు జితరాగ ద్వేషుల్
యోగులు, విశ్వక్షేమో
ద్యోగులు, నిస్వార్థ శాంతిదూతలు, జ్యోతుల్

ఆత్మ కదల వ్రాయ సర్హులు వారలు
అమర గాథలట్టి కథలు
చదువులన్ని మించు చదువులై మనుజుల
మంచివైపున నడిపించగలవు

స్వీయ చరితలు వ్రాయకే చెరగిపోని
చరితలై, చిరంజీవులై, మరపురాని
గాథలై, నరజాతియే గర్వపడగ
వెలసి రెందరో తమ మంచివలన జగతి.

నేనెట్టి గొప్పవాడను
కానిక కానేర నాత్మకద రచియింపన్
పూనితి, నాయడి సాహస
మైనను మన్నింప వలయు సభిమానముతో

నేను నిజము నెంత నిజముగా వచియింప
గలనొ నాకు నేను తెలిసికొనగ
పయనమునకు ముందు బరువు దింపుకొనంగ
వ్రాయుచుంటి నాత్మవ్యదను, కదను!

దెప్పుడు ఒయ్యాయి, నాలో
నావాసము సేయుచుండి అటు నిటు లాగన్
జీవితమతి సంకులమై
నావికుడె లేని నావ పడకలు నడచెన్

తెలిసియు తెలియని వాడన్
కలిగియు యాచించు బిచ్చగాడన్, కనులన్
వెలుగుండి గ్రుడ్డివాడన్
బలముండియు నోడిపోవు బడుగున్ వెడగున్

తప్పుల నెరిగియు చేసితి
నొప్పుల చెయంగ లేక యోడితి, నితుల్
చెప్పితి, వ్రాసితి నేనె
తప్పిలి, పరితాప వహ్ని అప్తుడనైతిన్

నొప్పించితి నా సేమం
బెప్పుడు నాశించువారి నెల్లర, మోహమున్
తప్పించితి, వంచకులకు
గుప్పించితి దనము, గొంతుకోతలు పడితిన్

తప్పుల తిప్పల బ్రతుకై
కప్పురమటు కరగిపోయె కాలము వృధగా
నిప్పున గ్రాగిన లోహము
చొప్పున కష్టాల గ్రాగి శుద్ధుడనైతిన్

నీతి కొరకని కొందరు ఖ్యాతి కొరకు
కొందరీ పాడు పొట్టకు కూటి కొరకు
ముక్తి కొరకు నావేశ విముక్తి కొరకు
ప్రేమ కొరకు ప్రేయసి మురిపెమ్ము కొరకు
ప్రజల కొరకు స్వదేశ సౌభాగ్యమునకు
విశ్వ కళ్యాణమునకని విశ్వసించి
కవిత వ్రాసిరి మును మహాకవులు, నేడు
నేను వ్రాయుట నాలోని నిజము కొరకు

# అమ్మ

తల్లి! చల్లని తల్లి సితమ్మ తల్లి!
కన్నతల్లి నాకెపుడు కాపున్న తల్లి!
పుడమి తల్లికి నోరుపు బోధచేసె
కల్పవల్లికి నీవిని గరపె నామె

సితమ్మ పెట్టి పోతని
సీతమ్మ కరమున నరము చిక్కఁటంచున్
సీతమ్మ చేతి చలువని
చేతము పులకింప వింటి చిరుప్రాయమునన్

నె పుట్టిన శ్రోత్రియమే
టూపరి పోయినది కాని రోజున్ మదిలో
దీపము పెట్టి తలంచెద
రా ప్రజ నా తల్లిపెరు సభిమానముతొ

అర్ధరాతిరి వేళయే అతిది వచ్చి
తలుపు తట్టిన చన్నీళ్ళ తానమాడి
వండి వడ్డించును కడుపు నిండుదనుక
లేదు లేదను మాటయే రాదు నోట

ఆమె వన్నె నెంచి అపరంజి తలవంచు
ఆమె పలుకు వాణి కమృత మొలుకు
ఆమె చేతి వంట అన్నపూర్ణకు పంట
ఆమె రూపు రతికి సలుకరేపు

ఆమె మసలు గేహ మానంద నిలయము
ఆమె వదనము సిరి కనుగుసదన
మామె యిడిన యన్న మాయుష్యవర్ధన
మ్మామె యాగ్రహమ్ము అగ్ని సమము

సిరులు పొంగిన వాయింట సీత వచ్చి,
పాడి పంటలు విరిసె నా పడతి వలన,
యశము దశదిశల్ వ్యాపించె నతివ కతన,
నడుగు పెట్టెను మాలచ్మి యనిరి జనులు

ఇంట బంధుల వలె నెవరెన్ని నాళ్లున్న
ఏల? ఎవరు? ప్రశ్నలెపుడు రావు
ఇల్లు పెరిగి కాదు, ఇల్లాలి హృదయమె
పెరిగె పెరుగుచున్న పేరుతోడ

పట్టు విడుపు లాచారమ్ము పట్ల లేదు
పట్టు విడుపు లాత్మీయత పట్లలేదు
పట్టు విడువదు సద్ధర్మ పాలనమున
పట్టు పట్టదు తన స్వార్థపరత వలన

అట్టి నా తల్లి గర్భాన పుట్టు టొకటె
నేను చేసిన పున్నెము, నేటివరకు
అదియె నా గర్వకారణ, మదియె నన్ను
కుక్షినిడుకొని శ్రీరామ రక్ష యగును

సకల దురిత హరము, సర్వ సంపత్కర
మఖిల మవ్యయమ్ము నా వ్రతమము
మాతృ పాదపద్మ మకరంద మాధుర్య
సేవనమ్ము దివ్యజీవనమ్ము

# అమ్మ

తల్లి! చల్లని తల్లి సితమ్మ తల్లి!
కన్నతల్లి నాకెపుడు కాపున్న తల్లి!
పుడమి తల్లికి ఓరుపు బోధచేసె
కల్పవల్లికి సిరిని గరపె నామె

సితమ్మ పెట్టి పోతని
సీతమ్మ కరమున సరము చిక్కఁపటంచున్
సీతమ్మ చేతి చలువని
చేతము పులకింప వింటి చిరుప్రాయమునన్

నె పుట్టిన శ్రోత్రియమే
ఊపరి పోయినది కాని రోజున్ మదిలో
దీపము పెట్టి తలంచెద
రా ప్రజ నా తల్లిపెరు సభిమానముతో

అర్ధరాతిరి వేళయే అతిది వచ్చి
తలుపు తట్టిన చన్నీళ్ళ తానమాడి
వండి వడ్డించును కడుపు నిండుదనుక
లేదు లేదను మాటయే రాదు నోట

ఆమె వన్నె నెంచి అపరంజి తలవంచు
ఆమె పలుకు వాణి కమృత మొలుకు
ఆమె చేతి వంట అన్నపూర్ణకు పంట
ఆమె రూపు రతికి సలుకరేపు

# పుట్టినిల్లు

నెల్లూరు మండలిన్ సూళ్ళూరుపేటకు
దాపున గలదు వత్సపురి గ్రామ
మందు వసింత్రు సదాచారు లాచార్య
వరులు, శ్రీవైష్ణవు లిరువదిండ్ల
వారందున కిళాంబి వారలే కలవారు
పెద్దింటి వారని పేరు గలదు
నిష్ఠాగరిష్ఠులు నిగమాంత వేద్యులు
నిత్యాగ్నిహోత్రమ్ము నెరపువార

లట్టి వంశాన నారసింహాభిధాను
డస్మదీయ పితామహు డమలయశుడు,
సిరులతోబాటు సద్గుణ గరిమతోడ
పుత్రవరుల నైదుగురిని పొందినాడు

నలువు రన్నలతోడ మలివాడుగా పుట్టె
పొట్టిగా పుట్టెడు బుద్ధితోడ
నా తండ్రి శ్రీకృష్ణనాముడై సీమాన
పెరిగె పెద్దల దారి విడిచి చనక
కొలది విద్యయె నేర్చి గుణవతి సీతమ్మ
నర్ధాంగిగా పొందె నది యదృష్ట
మన్నారు జనులెల్ల రన్నదే నిజమాయె
సీతమ్మ రాకతో సిరులు పెరిగె

సన్నలంద రమాయికు లగుట ఆస్తి
తానె అజమాయిషీ చేసె దానివలన
ఆస్తి చీలక పెరుగుచు నా దినాన
ఒక లకారము మించియే యుండెనంట

నోట 'సర్వేజనా స్సుఖినో భవంతు'
అనెడి మాటయె ఋప్పొద్దు లాలపించ
భూసురుల కిచ్చి రానాటి భూమినాధు
లగ్రహారాలు సాధుజనాశ్రయాలు

ప్రొద్దు పొడువక పూర్వమే నిద్దురవిడి
స్నానమొనరించి మడిగట్టి సందెవార్చి
దేవతార్చన సేయకే దినము గాని
మెతుకు సాపడరు జగతి మేలుకోరి

గాదెల నిండుగా కరువు
       కాలము సైతము గింజలుండ నిం
పొదిగ సాగె జీవనము
       భారత భాగవతాది సత్కధల్
వేదము లెల్ల వేళలను
       వీనుల విందొనగూర్చుచుండ, సం
పాదన బాధలంటక, ప్ర
       పంచముతో పనిలేక తృప్తిగా

తరతరాలుగ నిట్టులే తనివి తోడ
గడబిడయె లేక బ్రతుకులు గడిపినారు
పచ్చ పచ్చని ఆ పల్లెపట్టు భువికి
పచ్చరాలు చెక్కిన నగ భాతి వెలసె

సేద్యగాండ్రు చిన్న జీతగాండ్రును గల్గి
పాడి పంట గలిగి, పరువు గలిగి
దనము గలిగి కూడ మనసు మంచిది గల్గి
మా కిళాంబి వారు మనుచునుండ

పనివానికి యజమానికి
కనబడవు వినబడవెట్టి ఘర్షణ లెపుడున్

తనవారని తలపోయరు
మన వారని యుందు రైకమత్యము తోడన్

ధనముతో పనిలేపట దినము గడువ
మనిషితో పనిలేకుండ మనుట కల్ల
పెరుగు నింటింట కూరలు పెరటినిండ
పస్తులనుమాట పల్లెలో నాస్తినాడు

దాతు కరువు వచ్చె తాతగారుండగా
ప్రజలు తిండిలేక పల్లె విడిచి
వెళ్ళు కటిక వార్త విని వేదనన్ వారి
పిలిచి పలికిరిట్లు ప్రీతిమీర

తిండికి లేదని మీరిటు
లుండిన యూరుడిగిపోవు టుచితంబగునా?
పండిన గ్రామమ్మొక యే
డెండిన, బంధాలు తెంచి యేగుట తగవా?

తల వంపులు మాకయ్యా
వలదయ్యా యూరు విడిచి వలసలు పోవన్
కలియో గంజియొ పోయం
గలమయ్యా మీకు, మాకు కలిగిన యంతన్

గాదెలలో గల ధాన్యము
మీదేకద? మీ శ్రమ ఫలమేకద మీరీ
మేదిని దున్నితి రిన్నే
ళ్ళీ ధాన్యము మీకు గాక నెమిటికయ్యా

కలదయ్యా ధాన్యము గా
దెలలో తీసుకొనుడయ్య, దేవుని యానన్
కలుగదు సేమము యజమా
నులకున్, శ్రమజీవి కడుపు నులిమిన వేళన్

అని దాన్యము కొలిపించిరి
జనులెల్లరు చెతులెత్తి చల్లనితండ్రీ
యనగా, కలియుగ కర్త
యనగా అ ప్రక్క పల్లె లౌరా యనగా!

తాతగారిచెల అని వెన్ను వాతగా
పరుగుతీసె కరువు, పల్లె ప్రజయు
ముద్ద ముద్దకొక్క మ్రొక్కుగా తిన్నారు
తాతగారి పేరు తలచి కొలిచి

ఆ పున్నెమె ఈ నాటికి
కాపున్నది నాకు దివ్యకవచము కాగా,
రేపటికుండవు లకలు
నాపై రాబోవు వెళ్ళునప్పుడు వెంటన్

ఆస్తిపాస్తు లస్థిరములె యని యెరింగి
పెద్ధవారు పున్నెము కూడబెట్టినారు
వారసులమైతి మానిధి వాడుకొనుచు
పాపముల తోటి జమ్రవాయు పనియె మనది

నిప్పువంటి వారు నీతి అప్పని వారు
పరుషవాక్కు నెపుడు పలికి యెరుగ
రట్టి తాతగారి యాగ్రహమ్మెట్టిదో
తెలుపు మటని యొకటి కలదు వినుడు

ముసలి గ్రుడ్డివాడొక్కడు మొన్నదాక
నన్ను గాంచిన యంతనే కన్నుల తడి
పెట్టి యనుచుండె నయ్య మీ పెద్దవార
లెంత గొప్పవారో తమరెరుగరయ్య

తాతగారి నొక్క తప్పుడు మాటని
యనుభవించుచుంటి కనులు లేమి
కోపగింపలేదు శాప మియగలేదు
మంచలింపుగ నొక మాట యనిరి

కోతలు నూర్పిడుల్ ముగిసి
కూలిజనాలకు గింజలీయ మి
తాత పొలమ్ము రా నచట
ధాన్యము గొల్చుచు దుష్టబుద్ధి నా
దాతను మోసగించి, తగు
ధాన్యము కాలువలోన దాచ, నా
చేత నెరింగి నన్ పిలిచి
చేరువ కాలువ నున్నదేమనన్

ఏమి కలదయ్యా కాల్వను
స్వామీ కనుపించలేద? చత్వారమ్మా?
తామేల పొలముకడ కన
నా మాటకు వారు చిరుత హాసము తోడన్

కన్నులు నాకా కనపడ
కున్నవి చూడుమను మాట యొకటే యనిరా
చిన్నపలుకు ములుకై నా
కన్నుల చీకట్లు పొదుగ కడకిటులైతిన్

పలుకక పలికిన పలుకును
అలుగని వారలుగు పలుక అనల సమములై
జ్వలియించును దహియించును
విలయమ్మొనరించు పాప విపరీతములౌ!

## పగ - బలి

అట్టి మహనీయునకు కడగొట్టువాడు
చిన్నవాడయ్యు నా తండ్రి పెద్దగానె
పొందె మరియాద, నోర్వని కొందరకట
కసులు పుట్టి రేపిరి చిన్ని కలహములను.

ఇరువది గృహములు మెల్లన
నిఁపాయుటగాగ చీలి నెగసెన్ పగయున్
సిరిగల వారలమని మా
తరపున బలగమ్ము కలిసె దర్పము బలిసెన్.

వక్కలకుం చింతపిక్కల
కెక్కిరి కోర్టులకు కసిగ నెవరికి వారే
దక్కును తమకె జయమని
చిక్కిరి లాయరు గుమాస్త చేతికి వరుసన్.

ఆస్తులు పాస్తులున్ పొలము
    లాలుసు బిడ్డలటన్న చింతయే
నాస్తి, వకీళ్ళు సాక్ష్యములు
    నమ్మకద్రోహము లుక్కురోసముల్
దస్తుముల్ వకాలతులు
    అప్పుడు కేసులు నిత్యకృత్యమై
ఆస్తుల నాప్పివేసినవి
    అప్పుల పెంచిన వంతకంతకున్

దైవసన్నిధి తప్ప తలవంచి యెరుగని
భూసురుల్ నిలిచిరి బోనులందు
కోర్టులో, లాయరు కొంపతిన్నెల మీద
పడిగాపు లుండిరి పరువు మరచి
కూరగాయలు పాలు నూరగాయలు నెయ్యి
పెరుగు వకీళ్ళకు సరణమిచ్చి
మోసిరి గాడిదమోపు 'లా'పుస్తకాల్
చెట్లనీడల నిండ్లు చేసికొనిరి

స్నాన సంధ్యలు సత్రాల జరిగిపోయె
బ్రాహ్మణులు పోయి వెలసిరి 'బాపనోళ్ళు'
'స్వామి' యనువారె 'ఏమయ్యవార' యనిరి
స్థానమును తప్ప మరియాద తప్పెనంతె

చెట్టుల కడ గుట్టల కడ
గట్టుల కడ బావినీటి కడ చెరువు కడన్
గట్టిగ తుమ్మిన దగ్గిన
పట్టింపై పోరువచ్చె పగయున్ హెచ్చెన్

రావలదని పోవలదని
ఈవలదని పిల్లవాండ్ర కిడినారాంక్షల్
నివను నీవను వాదము
దేవుని కైంకర్యమంటె తెచ్చె తగాదా

కోవెలకు దర్మకర్తగ
నివగుటకు వీలులేదు నీ వెవ్వడ వీ
కోవెల మాదని యొకరన
దెవుడె మాసొమ్మటంచు దిగిరి తగవుకై

మగవారి లోన రేగిన
పగ చిచ్చులు పరచుకొనియె పడతుల లోనన్

మొగములు తప్పించుటతో
పొగలై సెగలాయె మూతి ముడుపుల తోడన్

ఇల్లిల్లు వేరు చెయుచు
నెల్లలు పడె, వాలకూడ దిటు కాకి యటుల్
అల్లుకొను మల్లె తీవెల
ఛళ్ళున పెకలించి పారవైచిరి కసితో

చక్కని శ్రోత్రియ మీగతి
ముక్కలు చెక్కలుగ చీలి మునుపటి విభవా
లొక్కొకటె వీగి తుదకు
దిక్కరి మసనమ్ము రీతి దిగులుగ తోచెన్

కుమ్మరి చాకలి మంగలి
కమ్మరి కంసాలి పసులకాపరి కరణం
బుమ్మడిగ నుండి రిపుడీ
కుమ్మున నిరుపక్షములుగ కుదిరిరి కొలువుల్

మునసబు మా దాయాదియె
అనంతశయనుం డసాధ్యు డతికుటిలుం డా
తనకిన్ మాకే వైరము
దనమున కధికారమునకు తగవై వెలసెన్

ఏదెనియు మజ్జనకుడు
సాధించె కుశాగ్రబుద్ధి సామర్థ్యముతో
మాదే పైచేయిగ దా
యాదిని నోడించె నన్ని వ్యవహారములన్

ఆస్తి తరిగె గాని ఆడంబరాలుండె
అప్పు పెరిగె గాని గొప్పలుండె

అపజయమ్ము లెదు ఆదాయమును లెదు
కోర్టు మ్రింగె వేలకొలది ధనము

అప్పటికిని మా వంగడ
మెప్పటి వలె సాగుచుండ నీర్ష్యాళువులై
ముప్పిరి గొను పగ యెదలో
నిప్పై ప్రతిపక్ష జనుల నిలువున కాల్చెన్

రోషములున్న నెందులకు?
రూకలు నీరుగ ఖర్చుచేసియున్
భూసర మంత వాని నొక
తూరి జయింపగ లేక పోయినా
మి సిరికేది కారణము?
ఈ గృహమిట్టి కళావిలాసమై
బాసిల జేయు వాని సహ
బాగిని భాగ్యమె వేరుకాదనన్

నమ్మినారయ్యయో గ్రుడ్డి నమ్మకమున
పన్నినారయ్యయో కుట్ర పాపమనక
పరమసాధ్విని, తల్లిని, పగకు బలిగ
తీసికొన్నారలయ్యయో! దివి కలంగ

ఊరి వైద్యునిగా జంగమొక్కడుండె
భద్రయ యనగ, వానిని పట్టినారు
దనము తలయెత్తు పోసెదమనిరి, వాని
పుర్రెలో తొలిచె దురాశ, పురుగు రీతి

ఇంటెడు చాకిరి నెకాకిగా చెసి
యుస్సురని యెరుగ దొక్కరోజు
మంచు కురియుచుండ మడిగ చన్నీళ్ళలో
స్నానమాడు, జలుబు జ్వరము రాదు

వండుట వార్చుట వడ్డించుటే పొద్దు
　　తల నొప్పి యని చెప్పి తప్పలేదు
ఐదుగురిని కన్న దా చిన్న వయసున
　　మందు వాడినదన్న మాట లేదు

సణిగి యెరుగదు నడిరేయి సమయమైన
అలసటలుకయు లేవు సీతమ్మ కెపుడు
ఎంత మెత్తని మనసుతో నెంత గట్టి
యొడలొసంగి, తగ్గించె నాయువును బ్రహ్మ

అతని దుశ్చేష్ట కాకున్న నన్యమగునె?
వజ్రదెహకు రుగ్మత వచ్చుటేమి?
యొడలు రవ్వంత వెచ్చగా నుండుటెరిగి
వచ్చె మృత్యువు జంగమ వైద్యుని వలె

నాడి చూచినాడు వేడియే యన్నాడు
జిహ్వ చూచి యిది యజీర్ణమనెను
కనులు చూచి రక్తకణము లేదన్నాడు
చెప్పెనెన్నొ గుండె చెదరి పోవ

మేలైన యౌషధము, ము
త్యాలును రతనాలు మెలి యపరంజి, మహా
మూలికలున్ చేర్చిన యది
యేలికలే వాడతగిన దిది యమృతంబే

అని నమ్మించి యొసంగెను
తన యెదుటనె మొదటి మాత్ర తన చేతులతో
తినిపించెను, మిత్తియు తన
పని యని మహిషమ్ము నెక్కి పాశము పట్టన్

పిల్లల గన్నతల్లి, నిరు
 పెదల పాలిట కల్పవల్లి ఆ
పల్లియకున్న తల్లి, కడు
 పారగ నన్నము పెట్టి దివెనల్
కొల్లలు గొన్న తల్లి, పెను
 కూరిమి యోరిమి పోతపోసి యీ
కల్ల జగాన కొక్క నగ
 గా విలసిల్లిన తల్లి కయ్యయో

విషమిడినారలం మందను
మిషతొ, మా యింట నామె మెట్టిన పిదపన్
బుసబుస పొంగెను సిరులను
కసితో, రక్కసులం కూడ కన్నీరిడగా

కుడి యెడమలన్న దెరుగక
కడుపులు వేల్ చల్లబరచు కనికరమునకున్
గుడిలేని యన్నపూర్ణకు
కడుపున పుండాయె నపుడు కర్మ ఫలంబై

రంగాచారి భిషగ్వరు
సంగతి విని చెన్నపురికి చన తగునని యా
మంగళకరుడౌ కేశవు
హంగుగ మదినెంచి పయనమైనారు వెసన్.

తిరువళ్ళిక్కేణిని నొక
ఇరుకౌ గృహమందు వసతి నేర్పరచి భిష
గ్వరుడే కన్నుల కగుపడు
పరమాత్ముండని తలంచి, పదినాళ్ళుండన్

విషమతి క్రూరమ్మగుటన్
విషమించెను చేయి మించు వేళయు వచ్చెన్

పసచెడె మహదౌషదములు
శ్వసనమ్మతి కష్టమాయె చలువలు క్రమ్మెన్

కళకళలాడుచు నుండిన
కలుముల సతి సాటి పడతి కళ తప్పెనయో!
కలుషాత్ముల కుట్రకు తా
బలియై తుదకొక్కనాడు పరమపదించెన్

మరునాడు మా యింటి పెరటిలో నారింజ
ఎక్కగిల్లెను తల్లి వ్రేళ్లతోడ
తల్లి పోయిన వార్త దహియించెనో యేమొ
గుండుమల్లియు తీవ లెండిపాయె
బావి దగ్గర గున్నమావి కాపును మాని
గొడ్రాలుగా మారి కుముల జొచ్చె
పిల్లల గుంపుతో కొల్లగా పెరిగిన
బొంత యరటి గుండె పొగిలి మాడె

తల్లడిల్లిన దాయూరు తల్లిలేని
చంటిపిల్ల చందాన మిన్నంటె నేడ్పు
పాడువడిపాయె మా యిల్లు కాడువోలె
శత్రువుల నీచకృత్యమ్ము సఫలమయ్యె!

# భ్రాంతి

అమ్మ కాలిన చితిమంట లారిపోయె
అమ్మ పోయిన ఎదమంట లారలేదు
పచ్చి కసుగాయ హృది విధి విచ్చుకత్తి
దూసి చేసిన గాయమ్ము మాసిపోదు

అమ్మ నటు పట్టణాన భస్మమ్ము చెసి
పగిలిపోయెడి గుండెల బిగియబట్టి
బ్రతికియున్న శవాలమై రైలుబండి
రొదకు శ్రుతి కల్పినాము మా రోదనమ్ము

రైలు దిగగానె మా బండితోలు గ్యాన
డెదురు వచ్చి ఘోరున నేడ్చె 'నెది యమ్మ?
ఏది మహలక్ష్మి? మా తల్లి యేది? బూది
చెసినార సీతమ్మను చెతులార

బండి కట్టి నెనె పంపినానమ్మను
తిరిగి రాదటంచు నెరుగనైతి
యముడు నన్ను మ్రింగి అమ్మను విడరాద?
చావు రాని పాడుజన్మ నాది!'

అని గోడున నెడ్చెన్, న
న్గని యెద హత్తుకొని తడిపె కన్నీటన్, నే
లను తల బాదుకొనెన్, దే
వుని తిట్టెన్, దుఃఖమోప కూరక దొరలెన్!

కాస్త తెప్పరిల్లి కట్టెను బండిని
చచ్చు నడగ నడువసాగె నెడ్లు
ఊరివైపు పడెడి యొక్కొక్క అంగయు
గునపమటుల గుండె గ్రుచ్చసాగె!

చెరవచ్చు వారి చిత్తశోకము పోలె
అలముకొన్న చికటుల నడుమన
నీరుగారు మాదు నేత్రాల కపుడూరు
కానవచ్చె నెడ్పు కడలి పోలె

రావిచెట్టు చరికిటా బండి దిగితిమి,
గుంపు గట్టు జనులు గొల్లుమనగ,
అంత కేశవాలయాన మ్రోగెను గంట
పల్లె వేయబోవు ప్రశ్నరీతి

కేశవా కేశవా యని కెలు మోడ్చి
నాన్న సాష్టాంగ దండప్రణామ మాచ
రించి, తమ దుఃఖమున్ నివేదించు నశ్రు
జలముతొ గుడి ముంగిలి యలికినారు

చేరి నిలిచెను మా చుట్టు యూరు మొత్త
మలవి కాని శోకమ్ముతో, నైనవారు
కాని వారలు సైతము కలిసి రపుడె
తెలిసె ఎతమ్మ పంచిన తీపి మనసు

బరువగు నడకలతొ, దు
ర్భర దుఃఖ విదీర్ణ హృదయ బాంధమ్ములతో,
బరువెక్కిన యూర్పులతో,
మరుభూమి సమానమైన మాయిలు చెరన్

సీతమ్మ పాదాల చిరుమెట్టెలల్లన
    మ్రోగ శ్రీసతి సదా మురిసె నెచట,
సీతమ్మ వదనాన చిరునవ్వు విరబూయ
    శరదిందు చంద్రికల్ పరవె నెచట,
సీతమ్మ సవ్యసాచిగ పెట్టి పోయగా
    కూరిమి దీవెనల్ కురిసె నెచట
సీతమ్మ సద్భక్తి సేవల గైకొని
    వేలుపుల్ కాపులై వెలసి రెచట

ఎచట సీతమ్మ ప్రేమ పండించె నెపుడు,
ఎచట సీతమ్మ వాక్కున కెదురు లేదు
ఎచట మాయమ్మ అమ్మాయె నెల్లరకును
ఎక్కడా యిల్లు? ఆ తల్లి ఎక్కడయ్యె?

ఇల్లా యిది? ఇందా నా
తల్లి వసించినది? దానధర్మ నిరతితో
వెల్లులు వేసిన యిల్లా?
నల్లని చీకట్లు చిమ్మె నరకమ్మటులన్

కడప కడకు చేర కడుపులో కయిపెట్టి
కలచివేయ దుఃఖలధి పొంగ
కనుల నీరు దొరల కాళ్ళు వడంకగా
పెకలిరాని ఏడ్పు పీక నొక్క

ఏడ్చు వారలు మమ్మ నోదార్చువారు
వివరముల విన నాత్రాన వేచువారు
కూడి రేయెల్ల గడచెను కునుకులేక,
కుదుటుబరచెను నా లేతయెదను నిదుర

తెలతెలవారుచు నుండన్
బిలబిల నండజము లొక్కపెట్టున నపుడే

తెలిసినదీ కబురన్నటు
కలవరపడి చెదరె మిన్ను గగ్గోలెత్తన్

'పలుకంబా! ఒగిపంబా!
పలుకవె యో భద్రకాళి! పలుకవె తల్లీ!
పలుకమ్మా మీనాక్షీ!
పలుకవె యో కనకదుర్గ! పలుకవె' యనుచున్

బుడబుడ డమరువు తోడన్
బుడుబుక్కలవాడు వచ్చె పూర్వాపరముల్
తడబడక చెప్ప దొడగెన్
దడదడ డమరుకకు గుండె తాళము వేయన్

"ఈ యింటి మాలచ్మి ఎల్లిపోయినదయ్య
నాలుగే నాలుగునాళ్ళ ముందు
సావు కాదది జీవి సావలేదింకను
అర్ధాయుష్షుగ పోయెనయ్య తల్లి
తీరలేదాయుష్షు తీరలేదు ఋణము
తీరలేదు కడుపుతీపి యింక
పిల్లలకోసమే అల్లాడుతుంటది
ఉంటది తిరుగుతూ యింటి చుట్టు
నా యిల్లు నా వాళ్ళు నా బిడ్డలే యను
పాశముండగ యమపాశము పడె

విడువలేకనే ప్రాణాలు విడిచె కడకు
యుసురు విడిచెనే గాని తా మసలినట్టి
ఇల్లు విడలేక నల్లాడు తల్లి" యనుచు
నంబపై నానయిడి చెప్పె నాతడంత

నను గాంచి డాసి మెల్లన
'చినదొర! నీపైన మమత చెప్పనలవి కా

దనుమానించకు! నిన్నె
కనిపెట్టుకయుండు నమ్మ కడవర" కనియెన్

ఝల్లుమనె లేత హృదయము
గొల్లున పసిగుండె పొంగి గొంతుక పూడ్చెన్
కీళ్ళన్ని సడలి నటులన్
కాళ్ళడుగున నెల కూలు కరణిని తోచెన్

'నా తల్లి దయ్యమగుటా?
నా తల్లికి భువికి దివికి నడుమన్ బ్రతుకా?
నా తల్లికి యాతనయా?
ఈ తిరిపెపు వాని కూతలెల్ల నిజమ్మా?

దెవత దయ్యమ్మగునా?
దేవళమున దయ్యమైన తిరుగన్ గలదా?
ఆవిడకు ముక్తి తద్యము
దెవుని సన్నిధిని తల్లి తిరముగ నుండున్'

అని నే ననుకొనుచుండన్
వినవచ్చిన పెద్దలెల్ల వెనువెంటనె యా
తని పల్కులు నిజమేమో
యని యూహాగానమపుడె యారంభించన్

'నాకు కనబడె నమ్మ మా నడవలోన
నాకు వినపడె నట్టింట నడచినటుల
పట్టపగలట్లు చూచితి బావివద్ద
తెల్లచీరతో కంటి మా తల్లి' ననుచు

మరునాటి నుండియే, న
ల్వురు కథ లటు చెప్ప నల్వురూఁకొట్టగ, ప

ల్వారు భీతిని పోవగ, కొం
దరు మానస విభ్రమ జనితమ్మనుకొనగా

నమ్మినను నమ్మకున్నను
అమ్మను చూడవలె ననెడి యాశయె నాలో
నమ్మకమై స్థిరపడి ని
త్యమ్మా బాగ్యమ్ము కొరకు తహతహ పడితిన్

భీతి యొక్కటి, నమ్మపై ప్రీతి యొకటి,
నొకట యెటు లుండునో యను నుత్సుకతయు
చేర వచ్చినచొ నెమి చెయవలయు
ననెడి యూహలు పెనగొన్న మనసుతోడ

చిటుకుమని యెట్టి యలికిడి చెవిని బడిన
యులికి పడుదును చాటుగా నొదిగి చూతు
రేయి యైనంత గుండియ రాయి చెసి
వేచియుందును తల్లిని చూచు కోర్కె

చీకటిలో దయ్యము సరి
గా కనపడదన్న శంక కలుగన్ కొంటిన్
చీకటి చీల్చెడి 'బ్యాటరి'*
నా కథ నేడెంత పిచ్చి యనిపించు గదా

నాన్న కమ్మ ప్రతిదిన మ్మగుపడ, వారి
రాతి గుండె కూడ భీతి జెంది
తరచు తోడు కొరకు దర్శ కృష్ణయ్యను
వెంట నుంచుకొనుట విని తపించి

నెను చూచినాను నిన్న సీతమ్మను
కన్నులార నేడు కాంచితినని

*(Battery) Torch Light

యూరివాడు సుతువ నుడికిపోవుచు నేను
వేచినాను కనులు వాచిపోవ

అమ్మ నా నిశాచరాకారమునసైన
చూచు భాగ్యమునకు నోచనైతి
ఎంతటి దురదృష్టవంతుండనో నేను
అమ్మకెనె పయ్యామైతి నేమొ

తల్లి నన్ను చూచి తనియుచుండిన గాని
తాను నా కొసగదు దర్శనమ్ము
కపకు కలలనైన కాంచు సౌభాగ్యమ్ము
లేదు నాకు నిదుర లేని కతన

కనుపించని దైవము మన
మనుకొను రూపాన హృదయమందున్నటులె
కనిపించని కతమున నా
జననియు నాలోన నిండె చల్లని రూపై

కనులు చూపు తగ్గి కానక పోవచ్చు
రెప్ప లార్చునపుడు తప్పవచ్చు
హృదయముండు దనుక మధుర భావమ్ములు
నిలిచి యుండు బ్రతుకు వెలితి దీర్చు

# క్షమ

ఆమెకు కల రిద్దరన్నదమ్ము లఖండు
లరసినారు కుట్ర జరిగినటుల
నుగ్రరూపులైరి యగ్రహారమ్మనె
మట్టి గలుప పట్టు పట్టినారు

మునసబు మురాను జంగాన్ని ముందుపెట్టి
చేసినారు ఫిర్యాదు, పోలీసులంత
వచ్చిపడి రూఢు హడల శ్రీవైష్ణవులను
తరల మన్నారు జైలుకు తత్క్షణమ్మె!

గడగడ లాడెను గ్రామము
హడలెత్తెను జంగమయ్య హతవిధి యనుచున్
వడకెను బ్రాహ్మణ వీథియె
పడతులు పిల్లలును జడిసి బావురు మనగా

అపు డనంతయ్య మా నాన్న కొత్త మిత్రు
డల్లనన్ వచ్చి, 'కష్టయ్య! పల్లె పల్లె
గొల్లుమనె చూడు, పోయిన తల్లి తిరిగి
బ్రతికి రాబోదు ఏల పాపమ్ము మనకు

వారి పాపాన వారినె వదలుమయ్య
వదలదా తల్లి యుసురు యెవ్వరిని గాని
తలచి చూడు పెద్దల మంచితనము యశము
దుష్ట శిక్షణ కున్నాడు శ్రేష్ఠు డొకడు

మానవునకు గొప్ప మన్నించుటె నయ్య
గొప్పవాడు తీర్చుకొనడు కక్ష
చెలగానివాడె చెడుగుకు చెడుచేయు
చెడుగు వలన మంచి జరుగు లేదు

సితమ్మ పేరు శాశ్వత
మై తనరున్ పల్లెలోన నాచంద్రార్కం
బా తల్లి పేరు చెరచెడి
చెతయె యగు పగకు పగను చెల్లించినచొ

పర దూషణ దుర్భాషణ
పర వంచన పరులు నొచ్చు పని నెరుగని యా
పరమ పతివ్రత పేరిట
తిరముగ తరములకు మచ్చతెత్తువ నివే

మంచిని పెంచి పంచినది
మాయని కీర్తి గడించుకొన్న, దా
మంచిని మంచిగా విడచి
మంగళమూర్తిగ వెళ్లిపొయె, ని
వంచకు లెల్లరున్ తలలు
వంచి నశించి తపించి పోవ, మ
న్నించుము, కాచు నీ క్షమయె
నిత్యము నిన్నును నీదు సంతతిన్

అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువారు నీ పూర్వులు, ఈ
యుపయశ మేటికి నేటికి?
కృపామతిన్ కావుమీ నికృష్టుల కృష్ణా!

చెసిన పాపము వతెనె
చెసిన పున్నెమ్ము కూడ చిగురులు వేయున్

వీనయి వృదయై పావడు
వాసిగ అరములకు పంట వచ్చును కృష్ణా!

మాయవెయకు మా తల్లి మంచిపేరు
తుడిచివెయకుం మీ యింటి దొడ్డతనము
నరికివేయకు పూర్వ పుణ్యముల తరువు
పెంచి తండ్రికి కొడు కనిపించుకొనుము ”

అని యెన్ని రితుల చె
ప్పెను దర్మార్థముల విప్పి ప్రియముగ, నీ వే
దన కిది యుపశమనము కా
దని చెప్పెను లోటు తీర్చదనియున్ చెప్పెన్

పల్లియ పరువు తలంచుము
తల్లుల పిల్లలను చూచి దయచూపుము నీ
కాళ్ళవి చేతులు కావని
గొల్లుమనెన్ కాంచువారి గుండెలు కరుగన్

'అన్నా! మా కభయం బి
మ్మన్నా! మన్నించుమన్న, ఆగ్రహమున్ వీ
డన్నా! జైలుకు పంపకు
మన్నా! కులమే ఖిలమగు నన్నా!' యన్నన్

విన్నాడన్నియు హృదయము
కన్నీరై కరగి కరగి కాల్వలు కట్టన్
కన్నుల యెదటన్ తన సతి
యున్నటులే మాటలాడె నుద్విగ్నుండై!

'సీతా! వినుచున్నావా?
నితులు దర్మాలు నేర్పు నెర్పరి మాటల్?

చేతము ఏతివలె రగిలెన్
నా తరమా, మరచి విడువ నరహంతకులన్

ఇటు చూడుము నీ యింటిని
అటు చూడుము కొడుకు కూతు 'రమ్మా' యనుచున్
బొట బొట కన్నీ రొలుకుదు
రెటులోర్తును, వీరినింక నెటు లోదార్తున్

నేనె సుమీ నిను చంపితి,
నేనే నీ పాలి యముడ, నేనె కన్నులన్
కానక వైరము పెంచితి,
దానికి నిను బలి యొసంగి దనుజుడనైతిన్

సాధించిన దేమున్నది,
బాధలు వేదనలు చిందు పరిభవ ఖర దు
ర్గాధలతో, నేనొక దు
ర్వ్యాధనువలె సర్వమోడి యొంటరినైతిన్

ధనము హరించె, త్రుళ్ళిపడు
దర్ప మడంగె, శిరమ్ము వంగె పె
త్తనము తొలంగె, దర్మపర
తంత్రత క్రుంగె, వివేకశూన్యతన్
ఋణములు పొంగి పల్కుబడి
మ్రింగె, మనమ్ము కలంగె, దర్మప
త్నిని నిను గూడ కోలువడి
నే నిటు నిల్చితి నేడు మోడునై!

విన్నావు కదా వీరల
విన్నపములు- మంచి చెడులు విడమరచగ లే
కున్నాను నీవె చెప్పుము
మన్నించుట మేల? ఇట్టి మనుజాధములన్

నిష్కళంకమైన నీ కీర్తికొక మచ్చ
వచ్చునవెడి తలపు వలన, నేది
నిర్ణయించలేక నిలకడయును లేక
మిడుకు నాకు తెలుపు మేలు కీడు

నీవు వెళ్ళినావు, నే వెళ్ళనున్నాను,
వీరలంద రెపుడొ వెళ్ళువారె,
మిత్ర శత్రు భేద మేమున్న దా మీద
మన్నులోన కలియు నన్ని యొకటె

కోపాలును తాపాలును
ఈ ప్రాణము లుండు వరకె యీశుని యెదుటన్
పాపము పుణ్యం బొక్కటె
ని పాలిట శత్రులైన నేస్తాలైనన్'

అని దర్మాధర్మమ్ములు
తన సతి ముందున్న యటులె తర్కించుకొనెన్
మన సిటు నటు లూగాడన్
కనులన్ బాష్పము లురల కడుపు కలంగన్

నాన్నగారిమీదె కన్ను లన్నియు నిల్పి
ప్రాణములు పిడికిట పట్టి యునిచి
యూరు వేచియుండె నూపిరి బిగపట్టి
వారి తీరుపె తలవ్రాత యనుచు

పండు జీవితమ్ము బలిగొన్న దుష్టులు
వెలుపు నోట జిక్కి వేయిసార్లు
చచ్చి బ్రతికి, బ్రతికి చచ్చుచు తమ పాప
ఫలము నా క్షణాన బడసినారు

శిక్షింపను రక్షింపను
వక్షుం డొక డున్నవాడు, ధర్మము వాడే
సాక్షియు వాడే, అన్నిట
నీ క్షేమం బెఱుగువాడె, నిజమున్ వాడే

వాడే కర్తయు కర్మయు
వాడే పలభోక్త, భోజ్య పలమును వాడే
వాడే కారణ కార్యము
వాడే కామ్యమ్ము, కామి వాడే తెలియన్

నీలో నాలో నుండియు
ని లోకాల తనలోన నిడికొని యుండున్
మెలో కీడో వానిదె
ఏలా యోచించు టతని యిచ్ఛయె జరుగున్

పరిపరి విధముల పథముల
పరుగిడు మది చిక్కబట్టి పరిశీలింపన్
గురుతర ధర్మజ్ఞానము
పరమార్ధము తెలియు స్వార్ధపరత నశించున్

నేను న్నీవను బేధా
లేనాడు నశించి సర్వమేకమ్మను వి
జ్ఞానము పొడమునొ నాడభి
మాన మ్మవమాన మన్న మాయయు మాయున్.

సీతమ్మ పేరు పెరుగును
నె తండ్రికి కొడుకు నౌదు నీ పున్నెంబే
నా తనయుల కాస్తి యగున్
చేతమ్మున కింత శాంతి చేకురు గానన్

కలడని సర్వము చూడం
గలడని ధర్మమ్ము మెచ్చగలడని, కృపతో
కలుషాత్ముల మది మార్చం
గలడని తా నిశ్చయించి కడకిటు పలికెన్

'అన్నా! యసంత! విను, నా
కన్నుల వెలుగైన పడతి కరుణావతి, తా
నున్నది నాలో నేటికి
మన్నించెద వారి నామె మంచిని పెంచన్'

విన్నారిది యో హెూ హెూ
యన్నా రావంశ మట్టి దన్నారీ మే
లెన్నటికిన్ మరువము మే
మన్నారీ పున్నెమఖిల మన్నా రొకటై

పోలీసుల కిచ్చెను వా
ఙ్మూలము నా భార్య మరణమున కిందెవరున్
మూలము కారయ్యా - మా
మూలుగ చనిపోయె నేల మోపుట నిందన్

వీరందరు మా వారే
వైరులు కారయ్య వావివరుస గలారే
దారుణ కార్యము సేయగ
నేరరు, బ్రాహ్మణులు, ధర్మనిరతులు గానన్

కాలము తీరి పోయినది
        కర్మ ఫలమ్మది, యేరికేది యే
వేళకు నెట్టులౌనది య
        భేద్య రహస్యము, మర్త్యమాత్రులా

లీల నెరుంగకే కలిమి
        లేములు పుట్టుట గిట్టుటల్, మదిన్
తాలిక వెట్ట యేడ్చెదరు
        తప్పుల నెన్నగ నెంతు రజ్ఞులై

నాన్నగారి మాట నమ్మి పోలీసులు
వదలిపెట్టినారు వైరి జనుల
ఊరికూరు మరల నొకసారి చాటెను
మా కిళాంబివారి మహిత యశము

నిజము అనను తానె రుజువు చేసికొనును
అరచి అరచి కల్ల అలసిపోవు
కల్ల కంఠమెపుడు ఖంగున మ్రోగును
నిజము గుండె గట్టి నిండుకుండ

ఈ దర విజయ పరంపర
లాదిని కల్లనె వరించు నది నశ్వర, మా
వేదన పడిపడి సత్యము
సాధించును తుదకు జయము, శాశ్వత పటిమన్.

# విద్యాబుద్ధులు

శ్రీ విద్యాదేవిన్ మది
నావాహన చేసికొందు నస్మత్కవితా
భావన, జీవ కళాన్విత
మై విశ్వహితమ్ము గాగ నర్పింతు సదా

ఐదుగురి కన్నదా మహాఇల్లాలు
మొదటి కాన్పు నేను, పిదప కన్న
ముగ్గురమ్మ కడుపు భగ్గుమనగ జేసి
చెల్లినారు, మిగిలె చెల్లె లొకతె!

నే నొకడనె మగబిడ్డను
కానుపులన్ తొలి మొలకను కనుపాపను, వం
శానకు నొక వారసుడను
కానన్ నను పెంచి రెంతొ గారముతోడన్

ఊరి తిరు నాన్నగారి పోకడ చూచి
తనయుని భవితవ్యమును తలంచి
తాను వెళ్ళు మునుపె తన యన్న వద్దకు
చదువు కొరకు నన్ను సాగనంపె

"చదువు లేనివాడు బ్రదుక నర్హుడు కాడు
చదువు రాని భవము చవిటి పొలము
చదువె కలిమి బలిమి శాశ్వతనిధి కాన
చదువుకొనుము తండ్రి చక్కగాను

పల్లెటూరిలోన బడి యున్నదె గాని
చదువుమీద శ్రద్ధ కుదురదయ్యా
గుడులు నుత్సవాలు కోర్టులే మిగులును
పనికిమాలినట్టి బ్రతుకు దక్కు

ఆస్తి యెంతయున్న నది శాశ్వతము కాదు
కూరుచుండి తిన్న కొండయైన
కరుగునయ్యా మనము కలవార మనుకోక
చదువవలెను నేటి చదువు కొంత

ధనము కాదు జీవితానకు నర్థము
మనసు వలయు మంచితనము వలయు,
ధనము పోసి యెవరు కొనజాల రవ్వాని
చదువు వలన నది సుసాధ్యమయ్యా

సారవంతమైన చక్కటి పొలమయ్యా
చిన్ననాటి మనసు, సేద్యగాడు
అదను తెలిసి విత్తినంత బంగరు పంట
పండి కన్నకడుపు నిండునయ్యా

మంచి సెద్యగాడు మాష్టారు నీకుంటె
కొరతలేని విద్య గరుప గలడు
వదుస మరచి యతని గురువుగా భావింపు
మపుడె విద్య మనసు నంటునయ్యా

తిట్టును కోపము జూపును
కొట్టును నీ మేలుకోరి క్రూరముగానే,
పెట్టును పెంచును కడుపున
పుట్టిన బిడ్డలను మించి బుద్ధులు గరపున్

ఇక్కడ దేహముగా, మన
సక్కదగా నుందు, కష్టమైనను చిన్నా!
చిక్కని యచ్చున పోసిన
చక్కని జీవితము రేపు సమకూరు కదా '

భావికాల మెల్ల బాగుగా యోచించి
ముద్దు మురిపెములను మూటకట్టి
కన్నకడుపు తీపి కనులలో తొణకాడ
దూర మనిపె మేలుకోదు తల్లి

శ్రీనివాస వరదుడన చిత్పురాన*
తెలుగు అధ్యాపకుండుగా కొలువు చేయ
చుండె పెదమామ, నివసించుచుండె కట్ట
మంచి గ్రామాన, గడియించె మంచిపేరు

చిన్నమామ జగన్నాథు డన్నకన్న
పట్టభద్రుడు, నుద్యోగి ప్రభుత లోన,
నతని సతి వేదవల్లి యనౌ నమృత హృదయ
పెంచె నను తల్లినె మరపించి తల్లి

చేరితి చిత్తూరంతట
నేరిపె పెదమామ చదువు - నేర్పగ చదువన్
చేరితి హైస్కూల్ మూడవ
ఫారమున పరీక్ష నెగ్గి ప్రథమశ్రేణిన్

పలకా బలపము పోయెను
కలమున్ పెన్సిళ్లు పుస్తకాలును వచ్చెన్
గలగల నురకలు వేసెడి
సెలవలె జీవితము చెంగుచెంగున సాగెన్

*చిత్పుర = ముచిత్తూరు

పట్టణ జీవిత మదియే
మొట్టమొదటి సారి జూచు మోజగునో? నా
పట్టున మామల మమతయొ
పట్టిన నేస్తాల బలమొ ప్రాయపు పరుగో

బడి నెగగొట్టి బజారుల
బడి తిరుగుచు తెగిన గాలిపటమై బ్రతుక
పెడదారి పట్టునో యన
చెడిపోవుట చిన్నమామ చెవిబడగానె

తనవద్ద నుండ రమ్మని
తన బిడ్డల మించి నన్ను దగ్గర చేర్చెన్
మనమున సోదరి తలపుల్
పెనగొని నాపైన నిండుప్రేమగ కురిసెన్

కల్లలు నల్లరి నడతయు
చిల్లర నేస్తాలతోడ చెడతిరుగుటయున్
చల్లని మామయు హృదిలో
మెల్లె దినదినము నాటి పుండొనరింపన్

బడిజీతమునకని పైకమ్ము నివ్వగా
కాఫి హోటళ్లకు ఖర్చుచేసి
పుస్తకములకని పుచ్చుకొన్న ధనమ్ము
సిగరెట్ల బడ్డీకి చెల్లుగట్టి
వెచ్చాల కొట్టుకు నిచ్చిరమ్మని పంప
ధనములో నొక కొంత తస్కరించి
చాలని దానికి చల్లగా చినమామ
జేబులో డబ్బులు చెక్కవేసి

కప్పి పుచ్చుకొనగ వేయి కల్లలాడి
పట్టుబడి, తిట్లుతిని యొట్లు పెట్టుకొనుచు

గాలి తిరుగుళ్ల చదువేమొ గంగ కలిసె
సుగుణ మొక్కటె లేదాయు జోక్యమపుడు

పాపము, తపించి పోయెను
నాపై మమకారము విడనాడగ లేకన్
కోపించుచు దండించుచు
కాపాడెను మామ నన్ను కనురెప్ప యటుల్

శత విధముల పోరెను, నా
బ్రతుకును సరియైన దారి పట్టించుటకై
గతి యెంతో మతి యంతే
ఇతరము కాజాల వెవ్వరేమనుకొన్నన్

తనకు పిల్లలుండి అలపోయ డదిసుంత
అప్పుచేసి యెన్నొ తిప్పలు పడి
ధనము నీరువోలె ధారపోసెను నాకు,
అడ్డు చెప్పదెప్పు డతని సతియు

బడికి పోవను, చదువను పాఠములను
పుస్తకాలట్టె పడియుండు బూజుపట్టి,
రెండు తరగతుల్ తప్పితి రెండుసార్లు
ఎటులొ చేరితి తుదకెస్సెసెల్సి నేను

ఇట్టులయ్యును మొద్దుగా నెంచరెవరు
పంతులయ్యలు నను బుద్ధిమంతుడనిరి
చదువడే కాని మతిపెట్టి చదివెనేని
వచ్చు పస్టని వింతగా మెచ్చుకొనిరి

అంత నొకనాడు జరిగెను వింత ఘటన
చెంగలువరాయపిళ్లె యనంగ నొక్క

నా సహాధ్యాయి పద్యముల్ వ్రాసి నన్ను
చూడమనె నేను బెట్టుగా చూతునంటి

అప్పటికి నే నెరుగ పద్యమన్న నేమొ
అయ్యవారికి మేనల్లు డగుట వలన
నెన్నుకొనె నన్ను, ఏమిటీ ఈశ్వరేచ్ఛ
రాత్రి రాత్రియె నా తలవ్రాత మారె

ఆతడిచ్చిన పద్యముల్ చేతబూని
పరుగు పరుగున పెదమామ దరికి చేరి
జరిగినది చెప్పి ఇప్పుడీ ఇరుకునుండి
తప్పుకొను దారి ఏదియో చెప్పుమంటి

కల్లలాడు గుణము కడకు నీ కిట్టుల
మంచి చెయు పరిణమించె నవుర
చదువుకొనుము నీవె ఛందస్సు, నివి కంద
ములని యిచ్చి పంపె పొత్త మొకటి

చదివితి పొత్తము మొత్తము
చదివితి నె కందమునకు చందము నాపై
చదివితి నాతని కవితన్
ఉదయమ్మగు లోన తప్పు లొప్పులరసితిన్

'తప్పులు చాల గలవు నె
చెప్పితినని కోపపడుట చెల్లదు నివే
చప్పున సరిదిద్దుకొనుము
పప్పులు నమలుటలు కావు పద్య రచనముల్'

అని బదులు వ్రాసి కవితన్
కనుగొన్న దొసగుల చూపి కవితాలత కా

దినమున ప్రారంభోత్సవ
మును చేసితి ముందు ముందు పూవులు పూయన్

అదియే నా తొలి పద్యము
అదియే నా జీవితాన కమ్మని పుటిక, నా
కది యొక పుట్టుక, నాలో
నొదిగిన ప్రతిభలకు నాందియో యన వెలసెన్

క్లాసులో నొకనాడు దుర్ఘటన జరిగె
కనులు విప్పారి కారు చీకటులు తొలగె
పట్టుదల వచ్చి మతి చిక్కబట్టి చదివి
జయము సాధింప చేసితి శపథ మపుడు

డేనియలను హెడ్ మాస్టరు
నా నడవడి నెరిగి పిలిచి నయముగ నడిగెన్
నె నాడు బొంకు లోర్వక
పూని యొసగె చెంపపెట్టు పూల్ అని తిట్టెన్

తల వంచినాను సిగ్గున
జలజల కన్నీరు కురిసె సహవిద్యార్థుల్
కిలకిల నవ్వగ రోసము
తలయెత్తెను తెలివి వచ్చె తప్పులు తెలిసెన్

మారినాను గతము మరచినా సంతటు
పుచ్చుకొంటి నెరువు పుస్తకముల
వ్రాసికొంటి ప్రతుల వారాన పదిసార్లు
చదివినంత ఎలితమొదవె దాన

ప్యాసైనా నెసెసెల్సీ
చేసని హర్షించి మామ బిరబిర కాలే

జీ సీటు గడించెను, ఈ
రీసు కళాశాల కనిపె ప్రేముడితోడన్.

కాలేజీ రోజులలో
నాలో నుదయించె కొన్ని నవ్యప్రతిభల్
మేలో కీడో నా బ్రతు
కే లక్ష్యము చేర నిశ్చయించెనొ విధియున్.

అప్పటికే నేనెపొ
తప్పుల తడకలుగ నూహ తరుమగ కవితల్
చెప్పుట మొదలిడి, మనసటు
త్రిప్పగ, కాలేజి చదువు తికమక కాగా.

కవితపై పిచ్చితో నాటకాల పిచ్చి
కలిసి చదువుపై నక్కర తొలగిపోయె
లోన నేదియొ యస్పష్టమైన కోర్కె
వేదనగ నన్ను ముప్పొద్దు వెంటనంటె.

ఇది యని నాకే తెలియదు
మదిలో గజిబిజిగ నేవొ మానని యూహల్
కుదురవు క్రమ పద్ధతిలో
వదలవు తుదిమొదలు లేక వచ్చెను కలలై.

బిగబట్టుదు నూపిరి నే
గగనానకు నెగిరిపోదు ఖగపతి యటులన్
దిగివత్తు భువికి నీ కల
పగపట్టిన యటుల వచ్చె పగలున్ రేలున్.

ఇట్టి స్వప్నమునకు నెట్టిదో యర్థము
తెలిసికొనెడి తలపు కలుగలేదు

తెలియనపుడు కొన్ని తీయగా నుండును
తెలిసినంత తిపి తీరిపోవు

అల్లిబిల్లిగ పద్యాల నల్లుకొనుచు,
నాటకాల వల్లించుచు, నటుడనగుట
కద్దమెదుట సాధన సేతు సభినయమ్ము,
ఒంటరిగ రోజు రోజెల్ల నుందు గదిని

చినమామ చెమట నోడిచి
దన మంపెను నేను కూడ చినవలె బియ్యే
ననిపించు కొన్న చాలని
తన సోదరి కాత్మశాంతి దక్కునటంచున్

ఒకనాడు షేక్స్పియర్ ఒథెలో యనెడి నాట
కమున దృశ్యమొకటి క్లాసునందు
తెగియించి నటియించితిని నాయికా నాయ
కుల పాత్ర లొకడనై గొంతుమార్చి
ఎప్పుడో చినమామ యీ దృశ్యము నటించె
గురుతుండె నది యూతగొంటి నేను
నాదు ద్విపాత్రాభినయము గాంచిన యొక
పెద్ద వీపున తట్టి బెషటంచు,

కలదు నీలో నెఱుగి కళాకణము కుఱ్ఱ!
శ్రద్ధగా పెంచు మీ కళాజ్వాలతోడ
ప్రజల సేవింప, ధన్యమౌ బ్రతుకు నీది,
యనుచు నాశీర్వదించె, న్నునదిమి యెదను

వారె వెంకోబరావను వారు, మాకు
నాంగ్ల నాటకాధ్యాపకు లమృత హృదయు
లారి తేరిన నటులు బళ్లారి రాఘ
వునకు నాప్తులు నా గురువు లయినారు

ఆంధ్ర సంఘము నాటక మాడునపుడు
నన్ను ముందిడి యొద్దికల్ నడిపినాడు
నడకయున్ చూపు మాటల వడియు బిగియు
చెప్పి, చేసి, చేయించి నా శిష్యుడనిరి

ఆనాటి నుండి నాలో
వినూత్న దృక్పథము తోచె వెన్నెల బాటై
నానా నాటకములనె
పూనిక పరియించి వాని పోకడలరయన్

మనసు చదువుపైకి మరలింపగా లేక
మొదటి యారునెలలు ముందవోసె,
విన్న తాతగారు వేలూరు వచ్చిరి
మంచి చెడుల నరసి మందలింప

వచ్చి వెంకోబరావు నే(గుచ్చి గ్రుచ్చి
యడిగినారేమి వీని పోకడలటంచు
వంశమున కొక్కడే యని వగచినారు
తల్లిలేని వాడని తల్లడిల్లినారు

తాతగారి హృదయ తాపమ్ము కన్నారు
నన్ను చూచి గురువు నవ్వినారు
తప్పొ లొప్పొ లెల్ల తర్కించి తలయూచి
చివర కొక్క తీర్పు చెప్పినారు

కలవండీ వానికి యు
జ్జ్వలమౌ భవితవ్య మిట్టి చదువులు వృదయే
కలవర పడకుడు కవియై
కళాతపస్వి యగు వాడు కాడు గుమాస్తా

ఆ వాక్కు దివ్యవాణిగ
దీవనగా దారిచూపు దివ్వెయుగా, నా
జీవిత సూచికగా, నా
భావి కళాంబుజము పొంది ప్రాభాతముగా

నడిపించెను నను యిందుక
నొడుదుడుకుల నోర్చి నిలుచు నోపిక నొసగెన్
బడలక ఉలక నిందల
వడగండ్లకు హడలిపోక వర్ధిలినాడన్

కాలేజి చదువు ముగిసిన
దాలాగుస్సు, బంధువర్గ మలతిగ జూచెన్,
చాలనిపించిన మామయు
కాలానకు వదలె, వాని కర్మ యటంచున్

ఎవరి జీవితగతి యెటులౌనో యెవ్వారు
తెలియగలరు? తీర్చి దిద్దగలరు?
దైవపూజ లోన తరియించు విరియొండు
పొలతి కురుల కులుకు పుష్పమొండు

## తొలిగాయం

శ్రీ కవితామూర్తిని నా
నా కళలకు నిలయమైన నవరస రాజ్ఞిన్
లోకహిత దివ్యకీర్తిని
చికటి పోకార్చనెంతు చిత్తము లోనన్

వేసవి సెలవులలో నొక
మాసము గ్రామాన నుంట మామూలయితే
ఈ సారి ఎస్సెసెల్సి
ప్యాసగు గరువాన నెను పల్లెకు వెళ్ళన్

ఎంగళంపాడు మాకు ఫర్లాంగు దవ్వు
అందుగల వారలెల్ల మా బంధుజనులె,
సందెవేళ షికారుగా సాగిపోయి
ఊసులాడి వచ్చెదరు రెండూళ్ళవారు

అచట యజమాన వంశజు లాప్తతములు
తెలుగు సాహిత్యమును మెచ్చగలుగు వారు
వరుసకున్ చిన్ననాన్నగు వారు, హాస్య
రసమయులు రాఘవాచార్య రసికులుండ

నెను వారింటనె పుట్టినాను, నాకు
వడుగు జరిగిన దక్కడే, కడకు జరిగె
నా వివాహ మాయింటనే, నమ్మలేని
వింత యనుబంధ మిద్ది, దైవికము, నిజము

ఒక సాయంకాలము నే
నొకడనె ఆయింట నూయలూగుచు నుండన్
మకరాంకుని విరితూపో
అకలంకమ్మైన మెరుపొ ఆనగా తృటిలో

కన్నుల ఎదుటన్ మెరసెను
వెన్నెల విరబూచినటుల వీణియ తంతిన్
సన్నగ మీటిన యటులన్
మిన్నేటిని నెగయు నురుగు మెరుగుల యటులన్

ఎవరా యని నే ననుకొన
నెవరా యని తాను సైత మెంచిన దెమో
నవనవ లాడెడి యౌవన
మవతారమ్మెత్తి యెదుట నగుపించె నహా!

క్షణమే మా యిరువురి వీ
క్షణమే గుండియల వలపు కణమై ఋణమై
క్షణికము కాదనిపించెను
గణగణ గోపాలుని గుడి గంటయు మ్రోగెన్

ఎదుటనుండి తా నదృశ్యమై పోయెను
ఎదను తిష్ఠవేయు టెరుగనైతి
ఎవరు ఎవరనియెడి పృచ్ఛకు 'నీదాన'
నను జవాబును విననైతి నపుడు.

చెప్ప మరచితి నా కెసెసెల్సి వరకు
జుట్టు ముడియుండె నెల్లరు చోద్యపడగ
నెస్సెసెల్సికి వచ్చిన యేడె తెగువ
చేసి క్రాపు పెట్టితి నాన్న చిన్న బోవ

గ్రామమందున షర్టులు క్రాపు తలలు
కలికమున కైన కనరాని కాలమద్ది
అందు వైష్ణవ కులమున నసలు నాస్తి
అట్టియెడ నన్నుగని యామె యబ్బురపడె

ఈ కుగ్రామమునందా
ఈ కుసుమాస్త్రుని పోలంతి కెనయగు పడుచా?
నె కలగనుచున్నానా!
నా కనులే మోసగించెనా, యను భ్రమతో

అడుగా సాగదు ముందుకు
ఎడదయు తన యాడతోడు నెపుడో చేరెన్
ఒడలా వివశంబాయెను
వెడలుట కుండుటకు కూడ వీలే లేకన్

రసికులగుట వలన రామవ చిన్నాన్న
యెరిగి నాదు మనసు, పరిచయమ్ము
చెతు నుండుమనియె చిలిపిగా నవ్వుచు
గుండె దడదడమని కొట్టుకొనియె.

అక్కడామె సైత మక్కిరి బిక్కిరై
నా గురించి యోచనలు తరుమగ
వచ్చి నిలిచె నెదుట వాకిట నప్పుడే
కనులు నాల్గు దెసల కలయ జూడ

పదునగు నద నొదవిన దని
యెద లెగసి యెగసి పడంగ నిరుపక్షాలన్
కదనము మొదలిడె కన్నులు
వదలెను వాల్గంటి వింటి వాడి శరమ్ముల్.

'అమ్మా! బాలం! క్షణమిటు
రామ్మా!' యని పిలువ నంతరంగము వెగన్
పొమ్మని తరిమెను లజ్జయు
క్రమ్మి గురుతు తెచ్చె నామె కన్నెతనమ్మున్

బాలమను పేరు వీనుల
బాలమ్ములు దూసి దొర ప్రాయపు నా హృ
ద్వీణా తంత్రిని మీటగ
బాలము బాలమను మాట పాటగ మారెన్

ఇది యేమి పేరు? పుట్టిన
పది రోజుల కెవ్వరెట్లు పసిగట్టిరొ, ఈ
యెద చీల్చు వాలు చూపులు
వదలిన వృదపోని మరుని బాణము లనుచున్

పెద్దలు చిన్నతనమ్మున
ముద్దుగ బాలమని పిలిచి మురిసిరి నేడా
ముద్దుల పేరే స్థిరమై
అద్దిర నా యెడల సార్థమైనది తుదకున్

అని తీయని తలపులలో
మునిగిన నె నులికిపడగ మువ్వలు ఘలు ఘ
ల్లనగా నెద ఝల్లుమనగ
కనులు జిగేలు మనగ కనగా కట్టెదుటన్

నిలబడి యున్నది చిన్నది
కలబడి కదనమ్ము సేయు కన్నులు నెలన్
జిలిబిలి ముగ్గులు వేయగ
మిల మిల చిరుచెమట నొసట మెరుగుల నిసన్

నిండు చంద్రు గన్న నీరధి తీరున
తలపు టలలు పొంగి తరుముచుండ
పైట చాటు యెడద ఆటుపోటుల లోని
సొబగులన్ని నాడు చూచినాను

'పిలిచినాడి నెను పిల్లా!
గలగల మని వచ్చి వాని కాంచిన యంతన్
నిలబడి పోతివె శిలవలె
బలె బలె' యని చిన్నునాన్న పక్కన నవ్వన్.

ఉగ్గున నులిక్కి పడి చెలి
సిగ్గున తలవంచి మించు చిరునగవులు తే
బుగ్గల కెగబడి కెంపుల
నిగ్గుల ముగ్గుల రచింప నిలిచిన యంతన్.

'వీడెవడొ ఎరుగుదువా?
వీడే సీతమ్మ కొడుకు విద్యార్థిగ ను
న్నాడిప్పుడు చిత్తూరున
నేడాది సెలవులు గాన నింటికి వచ్చెన్.

ఎదుటింటి పిల్ల యీ చిఱ
చదివిన దింగ్లీషు చదువు చక్కని గాత్రం
బొదవుట వీణియ మీటిన
చదువుల రాణి యనిపించు సంగీతమునన్.

పుట్టి పెరిగె రాజమహేంద్ర పురమునందు
మేన మామల గారాలకూన గాగ
ఇదియ తన యూరు తన తండ్రి యీతడనుచు
నెరుగ తొలిసారి తల్లితోనేగుదెంచె

భర్త తోటి బిడ్డ భవితవ్యమును గూర్చి
మాటలాడి మంచి మనువు కూర్చి
పెండ్లిసేయనెంచి పిల్లను తొత్తెచ్చె
నిన్ను యేండ్లు పివప కన్నతల్లి"

పరిచయము చెసి రా రచి
పెరిగెను మైత్రిగ మమతగ ప్రేముడిగా మ
మ్మిరువురం కాంచిన యెల్లయు
మురిసిన యురుపకములకు ముచ్చట గొలిపెన్

చిలుకమ్మ గోర్వంక చెరగులన్ ముడిచిన
ముద్దు మా ఇద్దరి యొద్దికంట
సంగీత సాహిత్య సంయోగ రససిద్ధి
కల జంట మాదంట కలల పంట
మాలతి మమకారం లోల రసాలాను
నిత్యానురక్తి మా నెస్తమంట
రసభావ శబ్దార్ధ రమణీయ నవయువ
కావ్య మధురిమ మా కలయికంట

ఈడు జోడున లెదంట యీడు మాకు
మమ్ము పరికించి అలలారి మనువు కుదుర
నింత యింపైన దాంపత్య మీ జగాన
కాన రాదని యింటింట కబురులంట

కన్నెయున్న నున్న కట్టుబాటును దాటి
కన్నతల్లి యనుప కలుష మెరుగ
కొక్క కంచమందు నొక మంచ మందున
కుడిచి పండి నాళ్ళు గడిపినాము

తెలిసి తెలియని తలపులు తొలకరింప
మొలకలెత్తిన కొంగ్రొత్త మోజులపుడు

తెరచినవి నాటిదనుకను తెరవనట్టి
డెందముల నందములచిందు నందనముల

కవల కిన్నాళ్ళు పడియున్న కాలమప్పు
డంది యందని జవరాలి డెందమటుల
అంతు చిక్కని చక్కిలిగింత లిడుచు
కథల కబురుల తెలియకే గడిచిపోయె

ఉభయు మనసు తెలిసి, నను చూచి, మము చూచి.
మంచి చెడులు తరచి యెంచుకొన్న
తల్లి కిష్టమైన యల్లుండ నైతిని
కొదువ పెండ్లి మాట కదుపులౌకటె

నెనె మాటల సంద
ర్భాన వివాహము గురించి ప్రశ్నింపగ నా
బాబా మటు తలుపు చాటున
కానంబడె చిలిపి కనులు కలవర పడగా

"నచ్చినావు తొలుత నాబిడ్డ కాపైన
నచ్చినావు నాకు, మెచ్చినారు
చూచు వారలు మిము యోచించు పనిలేదు
మనసు కలియు మనువె మనువనంగ"

పులకరించితి మా తల్లి పలుకులు విని
కట్టుబడియున్న పరువమ్ము గట్లు తెంచి
యురికి మాంగల్య బలమున మరుని గెలుచు
పర్వదినము డాసినదని గర్వపడెను

ఇంత సంబర మొక త్రుటి నెగిరి పోవ
వింటి నా తల్లి చిననాటి వింతగాధ

తాము చేసిన ద్రోహమ్ము దాచిపెట్టి
పరులపై రాళ్ళు రువ్వు నెర్వరులు నరులు

ఇదియా నీతియు సంస్కృతి
ఇదియా మానవతకు గురుతిదియా దర్మం
ఇది బ్రాహ్మణ్యమ’ వినుడిది
కథయా? బాలమును కన్న కడుపున వ్యథయా

పసిడి రంగు చెలంగు ప్రత్యంగమున పొంగు
        పరువంపు గరువంపు పడుచు తాను
పెద్దలొద్దిక గూర్చ పెండ్లాడి చెండ్లాడి
        మనసాడి తనువోడు దినము రాక
కొన్నాళ్ళు తన్నేలుకొనబోవు మగవాని
        మెలుకువన్ నిద్దురన్ కలవరించి
విరివింటిదొర కొంటె సరదాల పసదెల్చు
        నవనుకై పవనుగా నెదురు చూచి

కడకు నొకరెయి తాగన్న కల పలించు
మధుర లగ్నమ్ము రానున్న మాట తెలిసి
మోహమున్ సిగ్గు బిడియమ్ము ముప్పిరి గొను
కన్నెయెడ జిల్గుపయ్యెద గట్టె ముడుపు!

అమ్మ లక్కలు చెరి ‘అమ్మరో తమి మీరి
        దుడుకుగా దూకెడి యుడుకు వయసు
తొలి రేయి కనుదోయి గల మోహ దాహమ్ము
        నొక గుక్క తీర్చుకో నుత్సహించు,
మునుముందు మగవాని ముకుతాడు బిగియించి
        యక్కున నొక్క కైపెక్కునటుల
మాటలన్ ముంచి సయ్యాటలన్ తేలిచి
        మెచ్చు మచ్చిక లిచ్చి పుచ్చుకొన్న

పిదప మెలమెల్ల బింకాలు బిగువులెల్ల
సడల నొడిచేరి గడిదెరి గడుసు కంతు
నంతు కనిపెట్టు'డని హాస్యమాడి ముగుద
ననిపి రొంటిగ జంటగా పెనచు పనికి

పుట్టింటి వారలు పెట్టిన పుట్టెడు
రక రకాల్ నగల భారమ్ము తోడ
ఆరేయికని తన కత్తవారిచ్చిన
పట్టు పుట్టపు జరీ ఖరువు తోడ
ఇన్నాళ్ళు దాచిన ఎలకోర్కె లెత్తిన
మోసుల రాసుల మోపు తోడ
చిగురాకు పాదాల జీరాడు కుచ్చెళ్ళు
తగులాటమున కాళ్ళు తడబడంగ

మోహ భరమున కనులరమూతలు పడ
ముందు రానున్న దానందమో మరేమొ
ఎరుగకన్ జంకు లేజింక బెదురుతోడ
నడచె పదునైన తొలికారు పడుచుదనము

కిలకిల నగవులు వెలుపల
వలపుల తినిపించు హృదయ వల్లభుడా లో
పల నడుమన్ తా విలవిల
తలుపులు పడి గడియ బిగియు ధ్వని వినపడగా

తలుపు సందుల కిటికిల వెలితి నుండి
పొంచి కనుచుందురట యిట పొందు విందు
లుందురట దాగి మంచము క్రింద ననుచు
విన్నదె స్వానుభవము కానున్నవేళ

ప్రియుని వీక్షించు నాకాంక్ష పెరిగి పెరిగి
కడకు వంచించి తలవంచి కనుల నించ

పడతి చూపు లధోగతి పతిపదముల
రాగ రంజితమైన పారాణి నలదె

చాన మంచాన జాలపు సౌరు మీరు
విరి సరాల శరాల - విన్విల్లు వోలె
నిలచి సంగరాన కనంగు పిలచు లేఖ
నేల బొటనవ్రేల నవలీలగా లిఖించె

చూడ వేచిన మూర్తిని చూడనీదు
చెప్ప దలచిన యూసులు చెప్పనీదు
కోరి చేరిన దైవమున్ కొలువనీదు
సిగ్గు సొగసందు రది యెంత యెగ్గుసేయు

అపుడు పీటలపై నిటే యడ్డుపడెను
ఇప్పు డసలు సుఖానకే యెసరు పెట్టె
వారి దానను నెను నావారు వారు
ఏల యీ సిగ్గులని నిశ్చయించి తుదకు

తెగువచేసి సిగ్గుతెర తీసి పడవేసి
మూగనోము ముడిచి మూలవైచి
విరిసినట్టి తమ్మి విరులట్లు కన్నుల
నింతచేసి డెంద మెగసి పడగ

మనమున తా నూహించిన
మనసిజుకై చూడ నెదుట మంచము మీదన్
కనుగొనె కుష్ఠువినిర్గత
పుస దుర్గంధ వ్రణ గణ కశ్మలదెహున్

ఝుళఝుళ ఝర్ఝర ఝుణఝుణ
చళచళ నటరాడ్వివర్త ఝుంఝూ విచలత్

ప్రళయాఖిల ఘనాఘన
ఫెళఫెళ రావార్భటి భువి ప్రిదిలిన యటులన్

చీకటి ముద్దయి లోకము
శోకాకుల నేత్ర గళిత శోణిత దారా
వికర వికృతాకారము
గా కనబడె దుర్విధిహత కాంక్షామతికిన్

గొల్లుమనుచు నేడ్వ గొంతుక పెకలదు
ఊసురు విడువ గుండె ఓటుపడదు
కన్నదెల్ల నిజమొ కల్లయో యను చిన్న
సందియమ్మె జీవశక్తిగాగ

కలయా? నిజమా? భ్రమయా?
కలతయ? తన్నేడిపించు గారడి పనియా?
తెలియక, తెలివియు తప్పగ
శిలాకృతి వహించి నిల్చె జీవచ్ఛవమై

అటులె యున్న నెంత హాయిగా నుండును
మరలి వచ్చె తెలివి నరకమటుల
మతియు స్మృతియు మనసె మనిషికి శాపాలు
అవియె అన్ని వెతల కాకరాలు

కలత నిదుర చెదిరి కల కలంగిన యట్లు
యులికిపడిన పడతి నొక్క త్రుటిని
గత విషాదమెల్ల కనిబూని నట్టుల
తరుమదొడగె స్మృతులు త్రవ్వి త్రవ్వి

రాతిరి పవ లొక రీతిని
యాతురతన్ తపము చేసినందుకు వరమీ

వ్రాతయ? లేఁ యెడంద కి
రాత విదాత చితిపెచ్చి రగిలించుటయా?

తాళికట్టిన దిఁడా తలను నాడు
నెసబ్రాల్ పోసి, చేయిపట్టి చెరగు ముడిచి
సప్తపది చన్నదీతడా? శాప వశత
రూపు మారెనా? తొలిమాపు రూపు మాప

చెతులెటు లాడె నలువకు
నా తల నీ వ్రాతవ్రాయు - నాతిరయె గాదా
కైతల రాణియు - తానెటు
లాతని లేఖినిని పొదిగె నశుభాక్షరముల్

పరువము రౌరవమై నను
కరకర రంపానకోయు గతి బాధింపన్
సరసాలు, మరులు, మురువులు
కరువై తొలిపించె వాడె కడకు విపలమై'

అని విలపించెడి పడతికి
కనిపించె నెదుట ముకుళితకరుడై లజ్జా
వనతాననుడై గళితా
శ్రు నయనుడై ప్రాణవిభుడు క్షుభితాత్ముండై

గోరుచుట్టుపై రోకట కుమ్మినటుల
తనకు మ్రొక్కెడి పతిగాంచి తరుణి యెడద
నలిగెనే కాని పగులక నిలిచియున్న
కారణమ్మేమొ, ఏ యాశ కలదొ మిగిలి

కంటిని మంటినిన్ కలిప
కాల్వలు గట్టెడి బాష్పవృష్టి మి
న్నంటగ, శోకరుద్ధ గళ
మార్ద్రత పొంద నతండు పల్కె, "నన్

గంటివి కాదె పెద్దల య
కార్య మిదెల్ల, నిజమ్ము దాచి, ని
కంటను దుమ్ముకొట్టి మెడ
గట్టిరి పుస్తియ కాలసర్పమున్

వలచంటిని పెండిలియే
వలదంటిని గొంతుకోయు వంచన లెల్లన్
వలపుల వల్లరి వలతికి
వలను పడని వాడనంటి వ్యర్థుడనంటిన్

వినరైరి నాదు వినతిని
పినవాడని త్రోసిపుచ్చి పెండ్లి జరిగినన్
మనసే మారును కుదురును
తనువున గల వ్యాధి యనుచు తలచిరి పెద్దల్

అప్పు డీ వ్యాధి యింత లేదనుట నిజము
ఏదియు నిది యని తేలలేదనుట నిజము
నాకు మాత్రము దృఢమైన నమ్మకమ్ము
తగను పెండ్లాడ, మగడుగా తగనటంచు

మంచిగంధ మలది మల్లెపూవులు చల్లి
సెంటుబుడ్లు చిలికి చెమ్మటుడచి
అగరువత్తుల నెడతెగక తగులబెట్టి
నిజము దాచినాము నేటివరకు

నిన్ను నాడెకతమ్మున నేను కలిసి
యున్న నీ కుట్ర తెలిపియేయుందు నీ వి
పత్తు తప్పియుండును నను పాపిచెయ
విధి బలీయమై నీతల విసిరె పిడుగు.

కాలు దువ్వి వయసు కదను త్రొక్కగ నివు
వేచినావు వలపు విందు కుడువ

వి స్తరాకు వేసి విషము వడ్డించిన
పాపినమ్మ నాకు శాపమిమ్మ

నాపై మమకారముతో
ని పాపము కట్టుకున్న నెల్లర నయ్యో
పాపమ్మని మన్నించుము
కోపింప శపింప యేమి కొరతలు తిరున్

మన్నించు మమ్మ! ఇట ని
కన్నె తనమ్మునకు మచ్చ కలిగించక ని
మూన్నాళ్ళు గడిపి వేసెద
నిన్నంటక, సంటితేని నిప్పంటు సుమీ"

అతని పల్కుల కా సతి
యాతనపడి గుండె లవియ 'అయ్యో అయ్యో
నా తల వ్రక్కలు గాదె
చాతిరి నన్ను మ్రింగరాదె తండ్రీ' యనుచున్.

పతి పాదమ్ముల పడి 'నా
గతి కితరుల తప్పు చెప్పగలనా? ఏ దం
పతులను విడదిసితినో
గత భవమున, దాని ఎలఘుగా కితరమ్మా

తాళి కట్టిన పిదప హైందవ వనితకు
దవుడె మాదవుడు భవుడు తనువు మనసు
సకల మతని యదినమ్ము సలుపవలయు
నాతి నీతియె జాతి విఖ్యాతి గాన

అన్యమార్గాన చని అపయశము పొందు
కన్న, బొందెను విడుటయే మిన్నయన్న

సతిని కని విని తన హృది చితికిపోవ
గొల్లుమని యేడ్చె నా కన్నె వల్లభుండు

రెంటు గుండియ లాపధి పిండి పిండి
పిడియు నెత్తురు కన్నుల వెచ్చనైన
నీరుగా మూగయేరుగా పార, బైట
వివరమెరుగని కిలకిలల్ వెక్కిరించె

పన్నీట తడిసి సుఖముల
కన్నాకై యుండు రేయి కడకటు గడచెన్
కన్నీట తడిసి యెడదల
ఛిన్నాభిన్నమ్ము చేసి శిథిలాశయమై

నలగని పువ్వుల పాన్పును
కలగని మరు మల్లె జడను కట్టిన కోకన్
పల భక్ష్యమ్ముల నతివలు
తెలవారగ గాంచినారు తెలతెలపోవన్

ఇంతి కన్నుల నిసుమంత ఎరుపులేదు
బరువుగా రెప్ప లరవ్రాలి పడుటలేదు
సుదతి యూరక యావలించుటయు లేదు
సిగ్గుచాటున తొలికేళి పెగ్గలేదు

ఏమి జరిగెనో భయపడెనేమొ పిల్ల
కునుకు తీసెనో యల్లుడు గుర్రుపెట్టి
యనుచు గుసగుసలాడెడి యాడువారి
బాదపడలేక రెండు పవళ్ళు రేలు —

గడియ బిగియించి గదిలోన ముడిగి యామె
నంగజుని పోరు పడలేని యౌవనమ్ము

పరము నరమును కంబూని నమిలి నులుమ
ముప్పదెండ్ల ముదిమి పొందె మూడునాళ్ళ

నాపితౌడ మూడునాళ్ళగు లెక్కకు
నతివ సృష్టి కరయ నన్ని యొకటై
మొదటి రేయివలెనె ముస్తాబుతో భర్త
చెంత కేగి, గుండె చేతబట్టి

వచ్చి నిలచిన పతి సొంపు వంపులెల్ల
తనివితీర నాపాదమస్తకము నతడు
కనుల తుదిసారి జుర్రెడి కరణి చూచి
పరవశించియు నెడియో బాధ రగుల

“అమ్మా! ఇటు లాసీనవు
గమ్మా! తుదిరేయి మనకు గావున నీతో
నెమ్మది ‘నీ, నా’ భవిత
వ్యమ్మును చర్చింప నెంచితమ్మా” యన్నన్

సెలవిందని పతి పాద
మ్ముల పడి వర్షించి వెలిసిపోయిన ఆ క
న్నుల మిగిలిన నులివెచ్చని
జలకము మర్పింప, నోపజాలక విభుడున్

“తాకవలదమ్మ కన్నీట తడుపవలదు
పిడుగు లేగి నీ బ్రతుకెడ్పు కడలి
చెసె నీ కాళ్ళు నీ కళ్ళ మోసగించి —
తగవు నీ స్పర్శతో పునీతమ్ము సేయ

నిన్ను స్పృశియించుటకునైన నెననర్హు
డనన నొక్కటే సాక్షి చాలును గదమ్మ

ఇరుతరమ్ముల నిరీతి పురుగు తొలిచె
కౌగిలింతకు కాదు నీ కాళ్ళు కడుగ

నెనొక దృఢ నిర్ణయమున
కానాడే వచ్చినాడ నది ధర్మము పై
వానికు సమ్మతి మిరువుర
మౌనముకొని సాగిపోద మా మార్గమునన్

ని వలన నాకు సంతతి
కావలెనను కాంక్ష మెండు కానీ యిపు డీ
గావించిన ద్రోహముపై
నె విధి నీ కుక్షి వితు్తు డి రోగమ్మున్

ఈ యింటనున్న నట్టి యు
పాయ మెమ్మనగూడ వచ్చు, పలుతరములకీ
మాయని పాపము పంచుట
న్యాయమ? క్షణికములు గావ ఐహిక సుఖముల్

కనుక నన్నుపార్థము చేసికొనక మంచి
చేయలేకున్న చెడుగైన చేయకుంట
మంచి యని యెంచి నే నిర్ణయించినట్టి
దారి నడచిన మనకు చేకూరు మేలు

ఏదియో సాకు జూపి పుట్టింటి కేగు
మవల రాబొకు మిటకు, నీ కందువలన
వచ్చు మచ్చను నే కప్పిపుచ్చగలను
నింద తలవేసికొందు నా నిజము చాటి

వంశమున కొక్కడైనందు వలన నాస్తి
కేనె యజమాని నగుట నీకెట్టి కొరత

రాదు, రానీను నా వారసాదు వీవు
బార్యయే కూతురగుటెంత భాగ్యమమ్మ"

అని పలికిన పురుషోత్తము
గని తన ఖేదమ్ము మంచు కరణిన్ కరుగన్
కనుల కృతజ్ఞత తొణకగ
ననిపించె విభుండు హిమనగాగ్రమ్మటులన్

అనుపమానంద సంభరితాశ్రు వృష్టి
కురిసె హృదయాంబుదములు రెండొరసి మెరసె,
తెల్లవారెడు దనుక నా జల్లులోన
తోగి మొలకెత్తె నిష్కామ రాగలతిక

జవరాలు దవుమాట జవదాట కొకనాడు
పైనమై తుదిసారి పతికి మ్రొక్క
తనువుతో పనిలేని యనురాగయోగి తా
నాశీర్వదించె దీర్ఘాయువనుచు
'ఎవ్వరేమనుకొన్న నెక్కడెవ్వారున్న
విడిపోని వీ మూడు ముడులుగాన
మన మాలు మగలమే యని నమ్మి నెమ్మది
మను'మని మనసిచ్చి యనుమతింప

సతియు తన పాలి దైవపు చరణములను
హత్తుకొని ధూళి తలదాల్చి యడుగులోన
నడుగుగా సాగె మెట్టిని ల్లాదిలక్ష్మి
విడిచి పెట్టిన శ్రీపతి యెడదచేసి

ఉప్పు కారమ్ము తినెడి యీ యొడలి తొడ
నంతరాత్మకు పోరు నిత్యానుభవము
అట్టి సమరాన కొట్టు మిట్టాడి యతివ
కాయమే గెల్చె నుసిగొల్పు ప్రాయవశత

తొలుత తనువోడెనొ లేక తెలిసి వలచి
మనసు నోడెనో, ఒకని కప్పనము చేయ,
నైహికానంద మధుర రసానుభూతి
ఆమె కడుపున కూతురై యవతరించె

అవతరించిన కూతురి నాత్మజాత
గా తలంచి యాబత్త యజ్ఞాత పితగ
మనసు నింపిన ధనమంప మామ యింట
పెరిగె నిన్నెండ్లు, పెండ్లీడు తరుణి గాగ

విన్నాను కథను, కథకుని
కన్నులు కన్నీటి తెరలు క్రమ్ముట కన్నా
నున్నా రనుకొన్నా నీ
మన్నున మనసున్న మనుజ మాణిక్యములున్-

తప్పెవరి దన్న దరయక తల్లిచేత
కూతుపై మచ్చగా చూపి క్రూరసంఘ
మడ్డు పడునెమొ మా వివాహమ్మన కను
తలపు, నాలోన తృటిలోన కలిగినంత

మంచి చెడుగులు తరచి తర్కించి చూచి
నిలిచి యెదిరించి సాధింప నిశ్చయించి
అటొ యిటో తేల్చగా నెంచి అదను చూచి
మనసులో మాట నాన్నతో మనవి సేయ

'అయ్యో ఇదెట్లు సాధ్య
మ్మయ్యా! గోత్రమ్ము లొక్కటైనవి మనకీ
వియ్యము శాస్త్రీయము కా
దయ్యా!' యని నాన్న తెల్పి రభ్యంతరమున్.

ఎదురుచూడని యా భూత మెదుట నిలువ
దాని కనరాని గాఢాంధకార మలమి
పెనుతుపానున సుడివడి మనసు చెదరి
కూలె వలపుల కోవెల గోపురమ్ము

ఆ నిరాశాంధకారాన సగుపడె నొక
హేతువాదమ్ము చరిజూపు జ్యోతి రీతి
ఏది ప్రతికూల మగునని యెంచినానొ
యా కళంకమె యనుకూల మగుట వింత

'తల్లి చరిత నెరుంగరా? పెల్ల పుట్టు
వెరుగరా? లోక విదితమ్ము, ఇట్టి యెడల
ఏక గోత్రికులను వావ మెట్లు పొసగు'
ఎన్న నా వాదమును విన్న నాన్నగారు

'అందరెరిగిన నిజమె ని వన్నదెల్ల
కాని బహిరంగముగ చెప్పరాని నిజము
అన్ని వ్యవహారముల కామె అతని సతియె
సంఘ సమ్మతమైనదె సత్యమయ్య

కాళ్ళు కడిగి రేపు కన్నె నిచ్చెడి వేళ
ఇతని గోత్రమె వచియింప వలయు
మరణమందు కూడ మాయని మాంగల్య
మతి పవిత్ర బంధమయ్య' యనిన

'గోత్ర మొకటైన రక్తమ్ము కూడ నొకటె
యగుట సంతతి క్షీణించు నంతకంత
కిదియె గోత్రార్థ' మనుచు నె నెదురు తిరుగ
నన్ను వారించి పలికిరి నాన్నగారు

''నచ్చినది నిదు వాదమ్ము మెచ్చగలను
కాని కలదయ్య మనకు సంఘమ్ము, దాని

కట్టుబాట్లెవ్వరికి వారె కాదనుకొన
కాక్కి చింపిన విస్తరే దక్కు తుదకు

ఒకని మంచియె చెఱుగు వేరొకని యెడల
నేటి నీతి రేపటి యవినీతి యగును
మారు లోకాన మారని మంచి కలదు
సకల ధర్మశాస్త్రాల లక్ష్యమ్ము నదియె

వచ్చి పోయెడి వారలు వ్యక్తులెల్ల
జాతి కొలబద్ధ సంఘమ్ము శాశ్వతమ్ము
వ్యక్తి నది సుంత బాధింపవచ్చు గాని
ఒకడు పదుగురికై స్వార్థమోడతగును

మనిషి మొదటినుండి తనకు తానే వైరి
కట్టుబాట్లు చేయు కట్టుబడును
విసిగి తెంచుకొనగ విప్లవకాండౌ
నిన్ని పాట్లు సుఖము నెంచియె గద

కాన మార్పు తప్పదు కొంత కాలమునకు
వ్యష్టిగా కాక నదియు సమష్టి దృష్టి
కలిగినప్పుడే మేలగు, కాని యెడల
ప్రళయ తాండవమాడు స్వార్థమ్ము సుమ్ము.

ఎంచి చూడు మిప్పుడేది కర్తవ్యమో
ఏది మేలు సేయు నెంతమంది
కనుటె గీటురాయి, ఆశ అన్నింటికి
పసిడి మెరుగు లలది భ్రాంతి గొలుపు

తల్లి గుట్టు నీవు వెల్లడి చేయగా
పిల్లదాని బ్రతుకె యల్లరి పడు
మార్చలేవు నేడు మన సంప్రదాయాలు
తరతరాల వ్రేళ్ళ త్రవ్వలేవు

నీకు దక్కదు సరికదా నిజము చాటు
జరుగ డా పిల్ల కిక పెళ్ళి జన్మలోన
మరవిపోవుట మేలు మీ మమతలెల్ల
త్యాగ మనురాగమునకు పతాక సిద్ధి

ప్రేమ మృత్యువెన్నడు కాదు, ప్రేమ
నిత్య శోకమున్ గాదు, బలికోరు క్షుద్రభావ
మసలు కాజాల దమృత మద్వైత మగుట
సుఖము దుఃఖమున్ సమదృష్టి చూడగలదు'

ప్రేమ ఆత్మమ్ము విన్నాను పెరిగినాను
గోత్రమను శత్రువున కోడి క్రుంగినాను
వలపు, తెగియింపుమని యుసిగొలుపుచుండ
మమత విడుమని, త్యాగమ్ము మంచలింప

ఎదురాడ లెక, హృదయ
మ్మదుపునకున్ రాక, మెదడు నడకత్తెరగా,
ఎదురీద జాలు ధైర్యము
కుదురక, ప్రాయమ్ము పొదుగు కోర్కె లవియకన్

దారి తోచక బాణము తల్లికెల్ల
తెలుప ప్రమాన్పడి యనెనామె "తెలియవయ్యా
నాకు గోత్రాల గొడవ లీనాటి వరకు,
తెలిసినన్ పెంచకుందు మీ చెలిమి నింత

ఏమిసెయునెర్తు మింతియే ప్రాప్తమ్ము
కలలు గంటి మిమ్ము గాంచి మురిసి,
దాని సుకృత మింతలోన మారినదయ్యొ
యెటుల నున్నదొ మరి యీశ్వరేచ్ఛ"

కడుపు తీపి చెదు కన్నీరుగా పొర
పొగులు తల్లి కెను తెగువజేసి

దారి యొందు కలదు చత్తత సెయుట
యెంచిచూడు డని వచించి నంత

కొడుకును కూతురు తానై
గడుపున నొక కాయ కాచె, కళ్యాణముతో
నెడబాటె దుస్సహమ్మగు
నెడ, చత్తుగ దారపోయ నెటు లోర్తుననెన్!

ఎంతగ తలపోసియు మా
గ్రాంతరమున్ కాన కాశ లడుగంటగ, దుః
ఖాంతముగ సొంత మన్యా
క్రాంతముగా ముగిసె గాద కన్నీళులుగా

గురిని తప్పియు బాణము గుండెలోన
గురుతుగా గాయ మొనరించి తరలి పోయె
పువ్వొకరి కిచ్చి యొకరికి ముల్లొసంగు
బమ్మ చెతలు వట్టి దద్దమ్మ పనులు!

లోలోన కుమిలెనో? మా
మూలేయనుకొనెనొ? వలపు మొలకెత్తినదే
ఆ లేత హృదయ మెరుగదొ?
పాలించెనొ తల్లిమాట పాశవివశయై?

ఏమైన నేమి? బాణము
నామాసమె దారపోసి రన్యుని సతిగా
మామూగ బాద నమరము
గా మార్చిన పసుపుత్రాడు గళమున కులుకన్

ఏవవ దాదాపు పదియేండ్ల పిదప నేను
బాణమును చూడ గుండియ బావురుమనె
శిథిలమైనట్టి ప్రాచీన శిల్పమటుల
త్రవ్వె గత వైభవమునెల్ల తలపులందు!

వెదకి యిల్లెల్ల కానక 'వీణ యేది'
యనగ చిరుచెదు దరహాస మపహసింప
'నున్న దటకపై'నన్న ప్రత్యుత్తరమ్మె
ఆమె జీర్ణ జీవితభాష్యమై ధ్వనించె!

పిరికినై జారవిడిచిన ప్రేమ కలశ
మెదుట ముక్కలై ములుకులై యెదను గ్రుచ్చ
కసటు కన్నీటి రక్తమ్ము కరుడు గట్ట
నాటి తొలిగాయ మార దినాటి దనుక!

* * *

తొలిగాయము ఫలితముగా
చెలరేగెడి యౌవనమ్ము చేసెడి చెతల్
వలచి విలపించువారలె
తెలియంగల రవ్వి తియతీయని బాదల్

గాయము లెన్నైనియు ని
కాయమునన్ మాసిపోవు గానీ హృదిలో
గాయమ్మాజన్మాంతము
మాయని వేదనగ మారి మనుగడ మార్చున్

హృదయ వీణియ నొకసారి కదిపినంత
మ్రోగు ననురాగ మధురాగ మాగ దింక
మారు పలికెడి హృదయమ్ము దూరమైన
కొండకోనల పాలౌచు బండబారు!

దినచర్యలు వ్రాసుకునె 'డైరీల'లో పద్యాలూ, పాటలూ వ్రాసుకోవడం ఆత్రేయకు అలవాటు అలా ఆయన తన డైరిలన్నీ కవిత్వంతో నింపుకుంటూ ఉండేవాడు ఆ డైరీలు అన్ని కాకపోయినా కొన్ని అయినా దొరకడంతో, వాటిల్లోని ఖంత కవితల్ని ఏరి ప్రచురిస్తున్నాం వీటిలో కొన్ని మాత్రం లోగడ శ్రీ నార్ల చిరంజీవి సంపాదకత్వాన వెలువడిన 'స్రవంతి' పత్రికలోనూ, ఒకటి రెండు మదరాసు కళాసాగర్ వారి వార్షిక సంచికల్లోనూ ప్రచురితమైనాయి

— సం॥

# నవముక్తకాలు

భువిని మా అమ్మ కడుపున పుట్టుటొకటె
నెను చేసిన పుణ్యము నెటివరకు

మనిషి జన్మనిచ్చి మనసునిచ్చితివయ్య
ఇంతకన్న శిక్ష ఏమివలయు?

నాకు వెయ్యేళ్ళనిమ్ము ఈ నరకమందు,
మరల పుట్టుక లేనట్టి షరతుమీద

చిక్కువడిన దారపువుండ జీవితమ్ము
ఒకటి విడదీసి చూడ వేరొకటి పడును

వచ్చునపుడు తోడుతెచ్చి పాపాలను
యొంటరిగనె వెళ్ళునంట ధనము

గతము కలదు నాకు, కనుకనె భవితవ్య
మన్న దున్నదన్న ఆశ కలదు!

చెతులార తెలిసి చేయి కాల్చుకొనెడి
యతని కాకులైన అనలమగును

చేయగలిగినదే నెను చేయలేదు
చెయవలసిన దింకేమి చేయగలను?

నిప్పు గొప్పతలచి నీటిని వేధించు
నీరు పొంగి ఎపుడొ నిప్పునార్పు

ఏల మనిషిగ జీవింప నీవు మమ్ము?
మనిషి మనిషైన నీ గొప్ప మాయుననియ?

మనిషిగా పుట్టి చెవుడు మాత్రమేమి
బావుకొన్నాడు బాధలు పడుట తప్ప!

వెతకి వెతల తెచ్చుకొని ఆ వెతల మధ్య
శాంతిపొందగ, పడుదు నశాంతి నెపుడు

బాధనుండి కవిత ప్రభవించు - అందుకే
అక్షరమ్మురాక - అయితి కవిని

జననినె బాదపెట్టితి జన్మకొరకు
పరుల సుఖపెట్టగలనన్న భ్రాంతి ఏల?

సుఖముకోరి నేను సొమ్మును వెచ్చింతు
కరగిపోవు నొకటి - దొరకదొకటి

సుఖము నా తల్లిచేసిన సుకృతపలము
దుఃఖమంతయు నేటి నా దుష్కృతమ్ము

ఏడ్చుకొనుటకైన ఏకాంతమే లేదు
చుట్టుచేరి నవ్వుచుండు జగతి

నివు నా పాలి దీపమై నిలిచియున్న
పురుగునై పుట్టి మరణింతు మరల మరల

బ్రతుకుమీద నింత భ్రాంతిని కలిగించు
మత్తుమందు చూడ మిత్తి యొకటె

త్రాగి బుద్ధితప్పి వాగుట నిజమన్న
బుద్ధికన్న యిక అబద్ధమేమి?

గ్రహములేమి సెయగలవు నిగ్రహమున్న
అగ్రహ మ్మనర్థమగునుగాని

అందమైన బ్రతుకు అద్దాల మేడరా
ఒక్కతప్పుసేయ ముక్కలౌను

బ్రతుకు నేర్పిన చక్కని పాఠ మొకటె
'ఆశపడవద్దు నీకు నిరాశకద్దు'

నన్ను నన్నుగ ప్రేమించి నాకుగాను
ఒక్కనిట్టూర్పు విడువారె దక్క లేదు

ఇచ్చునప్పుడు లోకమెల్ల నా వారలె
అడుగబోప నొక్కరైన కారు

త్యాగమనున దొకటి తలను వ్రాసెను బ్రహ్మ
ప్రేమకొరకు దెవిరింతలెల?

గుండెలో ఎన్నియో అగ్నికుండములను
దాచుకొన్నాను వాటిలో దగ్ధమగుదు

ఏనుమనిషిగా జీవింప నెన్నిసార్లు
వ్యర్ధ యత్నముల్ చెసితి వ్యధితుడైతి

బ్రతుకునకు నాకు బద్ధవైరమ్ము సుమ్మి,
మిత్రిసాయాన దానిని మొత్తవలయు

ఎవరు నేనన్న ఎరుకలె కిన్ని ఏండ్లు
నెను నెననుకొన్న అజ్ఞాని నెను

నిన్ను ప్రేమించి సహనమ్ము నెర్చినాను
అలిగి నన్నేమి సాధించగలవు నీవు

చూడకుము న్ను, ని చూపు సోకినంత
తరలివెళ్ళిన ప్రాణముల్ తిరిగివచ్చు

చితిని కాలెడివేళ ఆ చిటపటలకు
భాష్యమేమి? నీ నామజపమ్ముగాక!

మనసు కలదని నీకు నమ్మకము కలుగ
చచ్చిపుట్టెద నె నెన్ని జన్మలైన!

కడలి అలలవోలె గర్జించు కురులలో
మునిగిపోయి ముక్తి పొందు టెపుడొ!

ఎడద నౌక యూబు డింపి నివేగినావు
అందు నీ చిత్రపటమె వ్రేలాడు చెలియ!

ప్రియునికై నిరీక్షించెడి వయసు నీడి,
యమునికై చూచు నపర సంధ్యయగు నాది

నీకు నా బాధ గోరంత, నా కదేమొ
చీమ నిను కుట్టినను గుండె చెదరిపోవు

సురను త్రావినవేళ నీ సొగసు నన్ను
అసురునిగ మార్చి మోహదాహమ్ము రేపు

ఎంత కక్ష నామీద సాధింప నెంచి
నిన్ను సృష్టించెనో బ్రహ్మ నె నెరుంగ

చెలియ! నీ కంటితడి వేడి తెలియు నాకు
ఎపుడు నీ హాస హిమవర్ష మెరుగగలను

ఎవరు నెనని నీ విపుడెరుగలేవు
లేని నాడె తెలియు నీకు లేని దెవరొ

వలచి విలపించి మరణించు వగపుకన్న
నిన్ను ద్వేషించి బ్రతికెద నీకుగాను

మ్రొక్కులను గొన్న నీ కాళ్ళు మోసగించె
మురిపె మెరుగని ని కళ్ళు తిరిగిచూచె

నిన్ను మనసార ప్రేమించినాను నెను
నీవు కసిదీర శిక్షించినావు నన్ను

నీవు వచ్చి 'నెను నీదాన' ననుదాక
పుట్టి గిట్టి మరల పుట్టుచుందు

నేటి నీ మోవి పలుకమ్ము నిన్నురేయి
విడియుమా! కాదు మునిపంటి దుడుకుతనము

దులుపుకొన్న పోవు ముప్పుల్లు పడినట్టి
అర్ధరాత్రివేళ ఆగడాలు

తలుపులేదు నా యింటికా దారిరమ్ము
వెలుగు తలక్రిందు దీపమ్ము, పలుకరించు

మనసుమెచ్చైన నా చితిమంట లెగయు
పొగలు నీ యింటి దారికే పోవు చెలియ

గురుతొకట నీకు, ఏ బూదికుప్ప పలువు
తావి నెగజిమ్ము నదియె నాదని ఎరుగుము

ఎన్ని బాణాలతో ఎద ఛిన్నభిన్న
మాయె, అతుకునె నీ తుది అశ్రుకణము!

ఆశగా తెచ్చితిని సుమహారము చెలి,
నాకు ముందెవ్వరో వేసినారు దండ

తనువు సడలి మనసు తల ఎత్తినపుడు నా
తలపులైన వచ్చి తలుపు తట్టు

చిగురు పాదాల క్రిందనె చితికిపోవు
లేత హృదయమ్ము నాది, ఈ కోతలేల?

అలిగినను నిన్ను వీడిపోగలన నేను?
కోపమైయుందు నీ కంటికొనల నంటి

సాటివారికి చేసెడి సాయ మొకటె
నీకు లోక మొసంగెడి నిధ కద్దె!

పరుల చెడుగెత్తి చూపుచు బ్రతుకు నరుడు
'కలదు మంచి కుక్క'ని బోర్డు కట్టడెపుడు

పొగడువాడె తెగడు! ముందు వెన్క లె తెల్పు
మిత్రుడగునొ వాడు శత్రుడగునొ!

తెలియ నీ కౌగిలింతల చలివెగళ్ళ
అనుభవించితి నిదు కోపాగ్నిశిఖలు

యుద్ధమును సృష్టిచేసిన బుద్ధి కెటుల
శాంతి స్థాపన మాత్ర మసాధ్యమగును?

వలపు బలము నెడె తెలిసికొంటిని నేను
పెరిగె వయసు బలము తరుగుకొలది

కొరతలేదు నాకు కోర్కె లేనందున
నిన్ను కోరి కోర్కె న్ను విడిచె!

లెనినాడు నాకు లేనిది ధన మొండె
ఉన్ననాడు లేనివెన్నొ కలవు

నిజము వచియింపవలెనన్న నీతి తోడ
'నిజము విని భరింపు'మనియు నెర్పవలయు

నిజముగా చెప్పగలిగిని నిజము — ఒకలె,
బ్రతు కబద్ధాల పుట్టగా బ్రతికితినని!

జ్వాల రగిలించి యెగద్రోయు గాలి యెపుడు
ప్రమిద నార్పియేతీరును పాపమనదు

మనము దేవుని ఆడుగుట మరతుమనియె
ఆడుదానిని సృష్టించినాడు స్రష్ట!

బిచ్చమెత్తుట నీవె నేర్పితివి కాని
ఎగులగొట్టితి వెద నింక పాత్రయేది?

గతముకన్నను మేలు రాగలదటన్న
చిగురు టాశావసంతమీ జీవితమ్ము

విరతలెన్నొని కొనియుత్తు చింపవేయ
మనసు మాత్రము వింపకు కనికరించి

అచ్చమైనట్టి బ్రాహ్మణుడన్న నెనె
లేదు రేపటి చింత ఏ లేశమైన

అందరిని సుఖపెట్ట ప్రయత్నమందు
బాధ పెట్టితి నందరి, బాధ పడితి

తరలిపోదును నామంచి మరచిపోండు,
చెడును ప్రయచెపి ఎవరిలో చెప్పవలదు

చావులేక బ్రతుకు శవమట్లు బరువౌను
చావె బ్రతుకు యొక్క జీవకణము!

ఎముకలన్ని చూపు 'ఎక్స్‌రే' కన్నను
మధువు 'సత్యరే'గ మాన్యమగును

మనిషిలోన నున్న మనిషిని చూపించు
మధువు కూడదన్న మందులెవరు?

పువ్వు పుట్టి వాడిపోవును, పూవిల్తు
పుండు పుట్టి ఆరిపోదదేల?

గ్రహములెల ఆడు గ్రహమొండు చాలదా
ఆడిపించ, మనల నెడిపించ!

మనుజులిడు తిండి తిని కూడ శునకరాజ!
నీవు విశ్వాస గుణమెట్లు నిలుపుకొనెదు?

నెడుచేసిన పాపాలు నేడె ఫలము
నిచ్చుచున్నవి, నాకు లేదింక జన్మ!

ఎవరి బాధలేని ఏకాంతము లభించు
చావు — బ్రతుకుకన్న చాల సుఖము!

మంచి పనిచేసి మనిషి గర్వించవచ్చు
చెడిపి చెడిపోయి ఏల యీ మిడిసిపాటు?

ఏల తారలు నేలకు రాలిపోవు?
క్రింది చూపున్నవారల చందమదియె

కాలమా! నీకు బానిస కాను, నీవు
ఎంత ఎదురొడ్డినను నెను ఎదుగగలను

నెను అలదాచుకొంటి నీ నీడలోన
నీడ మారిపోవునటన్న నిజ మెరుగక

అగ్ని శస్త్రమ్ము నీ కోపమైన యెడల
వారుణాస్త్రమ్ము నాకున్న ఒరిమి చెలి!

పరులు నీకెది చేసిన బాధకలుగు
పరుల కది సేయకుంటయే పరమ పదము

వర్తనాన సహనవర్తిగాని మనిషి
వత్తిలేని దివ్వెవంటివాడు

నిదు విరహాన చావక నిలిచినాను
విషము త్రావియు నింక జీవించగలను

పాపమును చెయు స్వేచ్ఛను బడసినావు
ఏల ప్రార్థన? దెవు డింకేమి ఇచ్చు!

చావు తప్పదు, కనుకనె జీవితమ్ము
తియనైనది! లేకున్న మోయగలమె?

కష్టములకైన నాతోటి కాపురమ్ము
కష్టమనిపించుతే కొంత కాలమునకు

చెప్పులను కొంటి కాళ్ళు రక్షించుకొనగ,
ముళ్ళు చెప్పులలోనె కాపురము పెట్టె!

ఓడిపోతిని జీవిత యుద్ధమందు
చావుతో సంధి కుదరదు! శాంతి లేదు!

తెలిసికొన్న కొలది, తెలియని దెంతయో
కలచనెడి నిజమ్ము తెలియవచ్చు

దంుములేమి భరింప నెర్తును, మనిషికి
మనసులేమి భరింపనెమాత్రమైన

నిన్న, నేడు, రేపులన్న త్రికాలాలు
పగలు, రేయి లేని బావమేను!

జోళ్ళులెవనుకొని శోకించినా నెంతొ
కాళ్ళు లేనివాని కాంచువరకు

నీ హృదయమందు తావుకై నిన్నువేడ
నీకు హృదయమే లేదన్న నిజము తెలిసె

జరిగెడి ప్రతి చెడు చాటున నెదియో
మంచి పొంచియుండు నెంచి చూడ
ఉరుములన్ని వాన కురియుటకే గదా!

వచ్చు నెప్పుడు క్రొత్తవే వత్సరాలు
పాతవై పోవు మన పాత పనులవలన

బల్లి పలికి పలికి పడిపోవు కుడితిలో,
నీతులన్ని వ్రాసి నేను నంతె!

---

# శాంతి

పువ్వులో — పసిపాపాయి నవ్వులోన
దివ్వెలో — తారల వెలుగురవ్వలోన
నవ్వగల ప్రతిమనిషి మనస్సులోన
నిన్నెకాంతును శాంతి! నా నిత్యకాంతి!

మెరుపు మబ్బుల చాటున మెరసినపుడు
ఉరుము దూరాన ఎక్కడో యురిమినపుడు
చల్లగా వాన చిరుజల్లు చల్లినపుడు
నిన్నెకాంతును శాంతి! నా నిత్యకాంతి!

పలుకరించిన పలుకని అలుకలోన
అలుక తీరిన చిరునవ్వు తళుకులోన
తళుకు లీనెడి కన్నుల చెలిమిలోన
నిన్నె కాంతును శాంతి! నా నిత్యకాంతి!

తల్లి యొడిలోన తారాడు పిల్లలందు
పిల్లయల్లరికి మురియు తల్లులందు
ఇద్దరిచ్చి పుచ్చుకొనెడి ముద్దులందు
నిన్నె కాంతును శాంతి! నా నిత్యకాంతి!

గున్నమామిడి చివురులో కోకిలమ్మ
కొసరి పాడెడి పాటలో కోర్కెలేవొ
గునిసియాడెడి గుండెలో దినదినమ్ము
నిన్నెకాంతును శాంతి! నా నిత్యకాంతి!

కడలి నెగసెడి అలలోన, కమ్మనైన
కైపులెక్కెడి నెలలోన, కైపుగొన్న

కనులు కాంచెడి కలలోన, దినదినమ్ము
నిన్నె కాంతును శాంతి నా నిత్యకాంతి!

కురిసి కురియని మంచులో కోడెవయసు
విరిసి విరియని మల్లెలో విడమరచిన
తెలిసి తెలియని మమతలో దినదినమ్ము
నిన్నెకాంతును శాంతి! నా నిత్యకాంతి!

వలపు వెచ్చని ఒడిలోన, పులకరించు
తలపు లూరెడి ఒడిలోన, పలుకులందు
తెలుపజాలని ఎదలోన, దినదినమ్ము
నిన్నె కాంతును శాంతి! నా నిత్యకాంతి!

తల్లిపాడెడి లాలిలొ, పిల్లవాని
కనుల కొలకుల జాలిలో, కనులు మూసి
కునుకు తీసెడి హాయిలో, దినదినమ్ము
నిన్నె కాంతును శాంతి! నా నిత్యకాంతి!

వల్లమాలిన సిగ్గులొ వగలుబోవు
పిల్ల ఎర్రని బుగ్గలొ పెదవిమీద
అలముకొను నవ్వుల నిగ్గులో అనుదినమ్ము
నిన్నె కాంతును శాంతి! నా నిత్యకాంతి!

అలికి ముగ్గులుపెట్టి ముంగిలిని నిలిచి
ఎదురుచూచితి నిన్నాళ్ళు ఎదను తెరచి
ఒక్క నిముసమ్ము కాపురముండి పొమ్ము
నీవు యుండుంచుము మీ యిల్లు నేడు శాంతి!

మూలబడిన మూగమురళిలో నేదియో
సన్న సన్ననైన స్వరము పలికె
మోవి చేర్చి భువనమోహన గీతిగా
అలపించరాగ దమ్మ శాంతి!

శాంతిలేని బ్రతుకు చావుతోబుట్టువు
శాంతిలేని గుండె చాకిబండ
శాంతిలేని కలిమి అంతులేని కొలిమి
శాంతిలేని ఇల్లు గొంతుముల్లు

శాంతి ఊరికేటి సెలయేటి చల్లదనము
శాంతి వృద్ధాప్య మెరుగని చక్కదనము
శాంతి తరుగని పున్నమి చందమామ
శాంతి తీరని తీయని స్వాంతదాయి

కొంపగిన డొక్క కోరిక మిగిలెను
శాంతి శాంతి ఆత్మశాంతి నాకు!
శాంతి నాది ఎన్ని జన్మలకైనను
శాంతిలేక నాకు జన్మవలదు

ప్రాణములు పోయినా నేను బ్రతుకగలను
శాంతి లేకుండ బ్రతుకు టసాధ్యమింక
శాంతి లేనినాడు స్వర్గమే నరకము
శాంతితో నరకము స్వర్గసమము

# నీవు - నేను

అందలమ్మెక్కి కవ్వించు అందమీవు
అందుకొన చెయి చాచెడి ఆశ నేను

నందనమ్మున విరియు ఆనందమీవు
లోకలోకాల ముంచెడి శోకమేను

గగనవీథిని వెల్గు నక్షత్రమీవు
భువిని మిడికెడి మిణుగురు పురుగు నెను

అంతు తెలియని అపురూప కాంతివీవు
మూలలన్ నక్కు చీకటిముద్ద నేను

కలుషముల నెల్ల హరియించు గంగ వీవు
పూర్వజన్మల పాపాలపుట్ట నేను

మధురభావమ్ము చిమ్ము సుమమ్ము నీవు
మండిపడు రాగ హోమాగ్నిగుండ మేను

ముట్టుకున్నంత కంచెడి మొగ్గ వీవు
మొదలు తుదిలేని జయదకాముకుడ నేను

శివుని నెలవైన కైలాస శిఖరి వీవు
సిరిని దాచిన శ్రీహరి యురము నేను

సఖుని మదిలోన నిమిడిన చలివి నీవు
చలికి ముద్దబారిన హిమాచలము నేను

ఆటవిడుపు కోరు అల్లరాటవు నీవు
అలుపు సొలుపు లేని వలపు నెను

మాటలే రాని పక్షి యారాటమునకు
కరిగి చిలికిన తొలకరి కవిత నీవు,

ఆదికవి రాతి ఎద నూఱినట్టి క్రౌంచ
మిథునముల ఎల్గులో మ్రోల్గు వ్యథను నేను

తప్పటడుగులు వేయుచు దారితప్పి
జారిపడి ఏడ్చు పాప కన్నీరు నేను,

చేయి నందించి గుండెకు చేర్చి సేద
తీర్చు తల్లి కడుపులోని తీపి నీవు

---

## అంతరంగం

కలలగాంచుచు ఏదొ లోకాన తీపి
కొరకు వెదకుచు ఏంగి వేసరిన ఎడద
ఒక్క సుదినాన నిను గాంచి యులికిపడెను
కలలు రూపొందెనని ఎంచి గర్వపడెను

కపట మెరుగని నిక్కళ్ళు కళలకిళ్ళు
కలల చిరుజల్లు విరజల్లు కార్మొయిళ్ళు
కలచి కరగించి ఎదచీల్చి కరుణనించి
వలచి వలపించి సంకెళ్లు వైచె చెలియ

పూచి పూయని ని నవ్వు పురిటినవ్వు
దవ్వునుండియే ఎదలోన తాకి త్రవ్వు
వాడి కుళ్ళిన ఆశల పూడికేత్తి
తెటతెనియ యూటల తెచ్చినింపు

మేలియపరంజి రంగు నెమ్మేని మీది
పసిడి గాజులు తెల్లగా పాలిపోయె
కారుచీకటి కురుల సింగారమలది
మల్లెపూవులు తీర్చె జాబిల్లిరేఖ

కటిక చికటి పూత దుప్పటము కప్ప
కాలపురుషుని యొడి నిశాకాంత యొదిగె
ముసుగులోనుండి వినిపించు ముద్దులట్లు
తారలొంటరిగాళ్ళను తగవుకీడ్చె

ఇసుక తిన్నెమీది పసిపాపలట్టుల
పిల్లకురులు నొసట నల్లలాడ

మూగనోము పట్టి త్రాగినా నందమ్ము
గాలి ఈలవేసి గోలచేసె

అదినిశీథి, నిదురమత్తు చెదరిపోవ
చల్లగా తాకె నొకకర పల్లవంబు
మనిషి కనరాని చీకటి మబ్బులోన
మనసులగుపించె నెట్టులో మనకు చెలియ!

ఎప్పుడో ఎక్కడో మన మిరువురమును
పరిచితులమైనటుల మిత్ర భావమేదొ
పలుకరించెను కన్నుల వెలుగులోన
పూర్వజన్మాల పుటలు త్రిప్పుకొని చూచె

నిన్ను పోగొట్టుకొన్న ఆ నిమిషమంచె
బ్రతుకు వల్లకాడై నాకు చితిని పేర్చు
నిప్పులారిన వెలిబూది కుప్పలోన
ఆగుపడును చూడు నీదు నామాక్షరాలు

అందినంతనె అందము అలుసుకాదు
దొరకిన కురూపి అందాల బరిణకాదు
అంతరంగాన అందమె అందమగును
దాని లోతును తెలియగా తరముకాదు

# ని జా లు

ఒకని గుండె పగిలి యొలికెడి రక్తమ్ము
పరులకమృత ప్రాయమగుట వలన
గాయపడిన నాటి గాలీబుఘజలులు
మధురకవితలాయె మనకు నెడు

నీవు కవయిత్రిగా పుట్టి నెను నీకు
కలముగానైన జన్మించ వలతు చెలియ,
అపుడు నీగుండె పడెడి మారాట మక్ష
రమ్మగును చెలి! నాపాళి రక్తమంటి

నింగితోటి నేల నెస్తమ్ము కోరెను
నెల నరసి నింగి జాలిపడెను
నెల నింగి కెత్తె పూలదోసిళ్ళను
మురిసి నింగి వంగి ముద్దులిడెను

సుఖము సాధించలేను, నా శోకమైన
స్వార్జితమ్మని నన్ను గర్వపడనిమ్ము
అదియు దేవుని మనతకు నంటుగట్టి
పట్టి చవటగ బ్రతుకుట వలదు నాకు

ఆస్తి కలవార లాస్తికులైనవారు
కనుకనె గుళ్ళు గోపురాల్ కలిగె నీకు!
ఆస్తి లేనివారల దెవుడైననాడు
నివుకూడ నాస్తికుడవు కావలయును!

మనుజులిడు తిండినె నమ్మి తినుట మరుగ
లేదు, కనుకనె పస్తులు లేవు నీకు!

పట్టెడన్నము తిన్న, మా బిక్తి హెచ్చి
వెండియన్నమె నీకు నైవేద్యమగును!

తెంచుకోవలె బంధముల్, తీర్చివేయ
వలెను ఋణములు, చంపుకోవలెను మమత,
బ్రతుకు తుదిరోజులైన నే ప్రజలకొరకు
బ్రతుకవలెను, చావు పిదప బ్రతుకుకొరకు!

కనుల ఎదుట శిరము ఖండించిపెట్టినా
గారడీగ నెంచు కఠిన హృదయ!
మానవులను నమ్మి మన్నించలేకున్న
దేవునైన నమ్మలేవు తుదకు!

కాకిగూటిలోన కోకిలమ్మొక్కటి
దొరకవచ్చుగాని దొరకబోదు
మనసు గలుగు ఒక్క మనిషి ఈ మందలో,
పిచ్చివాడ! ప్రేమ బిచ్చగాడ!

ప్రోడు కెప్పుడు చిగురుపై మోజు, బీడు
భూమికి మొలకపై మోజు, బోడితలకు
జుట్టుపై మోజు, 'లేదు' లేనట్టి నాకు
మోజులే లేవు నేడు ముముక్షువేను!

బ్రతుకునకు మిత్తిదిక్కుకే పరుగు, నదికి
కడలివైపునకె దౌడు, కడుపులోని
పాప కిలకిలరా తొందరపాటు, అన్ని
వీగిపోయిన నెన్నేది లాగగలదు?

మనసు మమతకు బానిస, ధనము పిసిని
గొట్టుకు సలాము, దేవుడు గొప్పవారి
బంటు, శునకంబొకండె విశ్వాసమునకం
కట్టుబడు, తక్కినవియెల్ల కల్ల కల్ల!

మనసు చెడి మంచు నీరుగా మారె, నీరు
వెతికి పల్లమ్మునకై చేరు పతితమయ్యె
పదుగురికి మేలొనర్చి తపఃఫలముగ
మరల పూర్వస్థితిని పొందు మంచుగాగ!

పాలుపోసి నాగుపామును పెంచితి,
దానిపేరు చెప్పు చావునున్న
మనిషి కాటువేసి మాయమైపోయె, ఆ
విషము పీల్చి పాము విడిచె తనువు

మానవులమీద నాకు నమ్మకము పోయి
కుక్క నొకదాని పెంచితి కూర్మిమీర,
తిండి నాయింట, కాపలా యింటనేమొ
పరుల యింట, నదేమి దౌర్భాగ్యమయ్యొ!

మానవుడ నేను, జీవలోకానికెల్ల
మకుటమని, ప్రకృతి శాసకుడను, మంచి చెడ్డ
లనెడి రెండు సృష్టించి వాటిని గురించి
జీవితమ్ము వెచ్చించి యోచించు వాడ!

ఏది మంచియో చెడుగేదొ యింతవరకు
తెల్పుకోలేక, తెరని తిమిరమందు
తిరుగులాడుచుంటిని కోట్ల దీపకాంతి
చుట్టు వెలిగించి యెఱుగా నట్టినడుమ!

తెలియుననని, తెలిసితినని, తెలిపెదనని,
వాగితిని, వ్రాసితిని, అహంభావినగుచు —
నేను నేననుకొనుచు నిన్నాళ్ళు గడచె,
ఎవరు నేనన్నదింతకు నెరుగనైతి

పలితకేశములా, ముడుతలు పడిన తనువు,
మసకబారిన చూపులా ముసలితనము?

మనసుకు ముదిమిరానంత దనుక, నాకు
వయసు పదహారు దాటదు! వగపదేల!

మార్చలేనిది యోర్చు నిమ్మళమునిమ్ము,
మార్చగలవాని నోర్వక మార్చగలుగు
ధైర్యమొసగుము, రెంటికి తారతమ్యో
మెరిగెడి విచక్షణాజ్ఞాన మిమ్ము దేవ!

దినదినానకు పెరిగెను తెచ్చుకొన్న
జీవిత ఋణమ్ము — కాలమ్ము చెల్లుచుండె,
చెల్లుబడలేదు నేటికి చిల్లిగవ్వ
జాలిలేని మృత్యువెపుడొ జప్తుచేయు!

చలనచిత్ర నిర్మాతలు సంతసిల్ల
సురకవి వరుండిది విని యచ్చెరువు పొంద
గురువు మల్లాది శ్రీశ్రీయు సరసనుండ
తరలె నాత్రేయ పరమపదమ్ముచేర!

# నేను

ఇట్టిదినము లెన్ని యేగినవోకాని
తెలియనైతి, కనులు తెరువనైతి

నాకు రెండు కలవు, నాకము, నరకము,
కాని రెండు కూడ కలిసిపోయె

వెలుగునీడ లట్లు పెనుకొంటి బ్రతుకు
పడుగుపేక లనేడు వరుసమరచి

నిచముచ్చమెదో నె నెరిగితి మున్నె,
కౌగలింతు — నేను కనులుమూసి

కోటిమందికెను గురువునై యుందును
లాభమేమి? నె గులామునైతి!

గతము భయము, ముందు గాఢాంధకారము,
కలదు మేరువంత — గట్టిగుండె!

ఎందరెందు 'రాత్మబంధువు' లున్నారు —
లెక్కకని మిగుల లెక్కడేని!

---

# పుట్టినరోజు

పుడమి గాఢాంధకారాన నడగియుండ,
రేపు రాజును ప్రసవింప రేయి పడతి
పురిటినొప్పులు పడుచుండ, భూతగణము
చెలగి చెలరేగి తిరుగు నిశీథమందు
చైత్రమాసాన అమవసన్ జన్మతార
భరణిగా, ధనుర్లగ్నాన, ధరణికొక్క
క్రొత్తజీవుడు వచ్చె నిమిత్తమేమొ!
ఆతనితో లోకమున కెట్టి అవసరమ్మొ!

తల్లిపీల్చు గాలి తనయూపిరిగ నిన్ని
నాళ్లొదిగి, ఎదిగిన నలుసు నేడు
తనకుతానె యూపిరిని పీల్చు స్వేచ్ఛకై
తల్లి కడుపు కాలదన్ని వచ్చె

భువికి వచ్చెడి ప్రతిపాప దివిజదూత
దివ్యసందేశ మేదియో తెచ్చునంట,
నరుల మాపాప బాసల నెరుగలేక
తెలిసికొనలేము దాని సందేశమేమొ,
పాప మన భాష నేర్చెడి ప్రాయమునకు
మారిపోవు, తా నెవ్వరో మరచిపోవు

మగబిడ్డ పుట్టినాడని
మగనాలిన్ మెచ్చి మగడు మరిమరి మురియున్
జగతిన పడిన క్షణమ్మే
గగనము పిక్కటిల నతడు 'క్యారు'న నెడ్చున్

'ఎడ్చినాడమ్మ పాపడు, ఎంత గొంతు,
అబ్బకొడు'కని బంధువుల్ హాస్యమాడ,

'ఏడ్చినాఁడమ్మ భయము లేదింక'యనుచు
మురిసి నెమ్మదిపడ నూర్చె మంత్రసాని

ఏడ్పు జీవలక్షణమట, ఏడ్వకున్న
కొట్టి ఏడ్పింతురట బిడ్డ పుట్టగానె,
ఎంత ఇష్టమో నరజాతి కేడుపన్న,
ఆతని ఏడ్పున కసలైన యర్థమేమొ

ఒడి విడచి వచ్చినందుకు దిగులు పడెనొ,
జగతి చీకటిగమిగాంచి జడుసుకొనెనొ
శోక పంకిల దీనభూలోకము గని
చిన్నిపాపని గుండియ చెదరెనేమొ

ఆకలిగొని బిడ్డడమ్మాయనుచు ఏడ్వ
కడుపులోని ప్రేగు కదలిపోవ
పాలపొంగు ఎడద పరవళ్ళు త్రొక్కగా
తల్లడిల్లి వచ్చు తల్లి ఎపుడు

ఒకసారి పాలిచ్చి యోదార్చు పాపని
  మరుసారి ఎందుకో మందు పోయు
ఒకసారి యూయల లూపి పాడును జోల
  మరుసారి గట్టిగా మందలించు
ఒకసారి గారాన నొడలంత ముద్దిడు
  మరుసారి తాకిన 'మైల' యనును
ఒకసారి నడిపించు నూతగా చేయిచ్చి
  మరుసారి నవ్వును దొరలిపడిన

వెక్కిరించు, ఏ తతి దుష్టుడనును
'తండ్రికొడుకు'కను, 'నాకన్నతండ్రి'యనును
ఎన్ని యర్థాలొ పాపని ఏడుపునకు
ఒక్క తల్లికె యెరుక ఈ యుర్విలోన

---

# నేటి బ్రతుకు

పతితమైపోయె నేటికి బ్రతుకు, హిమన
గాగ్రమందుండి మన నిబిడాంధకార
ఘోరభీకర కూపాన కూలిపోయె!
ఎన్ని జన్మలకా యగ్ర మెక్కు టింక!

కలలోనైన తలంపలేదు తుదకీ
        గాఢాంధకారంపు సం
కెలలన్ చిక్కి కృశించిపోదునని,
        ప్రాగ్దిక్కాంత నామీద క
త్తులు దూయన్ సమకట్టె, మత్కృత మహా
        దోషమ్ము భాష్పోదకం
బులతో క్షాళన చేసికోగలనొ, ముమ్ముందేమి కానున్నదో!

వెలలేనట్టి పవిత్ర మర్త్యభవమున్
        వెచ్చించితిన్ హేయ చిం
తలపాల్జేసి, ప్రశాంత మానసముపై
        తాకెన్ తుపానొండు, ము
క్కలుగా నైతిక పాటవమ్ము పగిలెన్,
        గాండ్రించి పైదూకగా
బలితంపున్ మరణమ్ము మారడిన దా పాపాగ్ని చల్లారునా!

పాపముచేసి దాని పరి
        పక్వ ఫలమ్ము లభించినంత సం
తాపములేల? ఈ ప్రకృతి
        ధర్మమవశ్య, మవార్య మేరికిన్
పాపపుపైరు పున్నెముల
        పంట నొసంగుట కల్ల మూర్ఖుడా!

వేపను విత్తి ద్రాక్షకయి
వేడుక పడ్డటులున్నదేమిరా!

కాలమ! కక్షబూని యిటు
కారము నూరెదవేటి కన్ని క
ష్టాలను చూచినా నిక
విచారము శూన్యము, నన్ను చూచి మీ
సాలను దువ్వ నేమిటి క
శక్తుడనై తలవంచినా, నిదో
కూలిచిపొమ్ము నా బ్రతుకు
కొంపను, శాశ్వత కీర్తి నీకగున్

ఆశల త్రుంచినావు, మరి
యాద గుబాలున ముంచినావు, నా
వాసి నడంచినావు, ఋణ
భారమునన్ తవిలించినావు, వి
శ్వాసము త్రెంచినావు, నగు
బాటొనరించితి, వింత ద్రోహమున్
చెసియు తీరదా తనివి?
శేషము శుష్కశరీర మొక్కటే!

నివు హరియించలేనిది, నీకు లేని
దొక్కటే నాకు చివరంట దక్కగలదు
అదియె హృదయమ్ము! దానిని పదిలపరచి
మనిషిగా వెళ్ళిపోదు నా మటుకు నేను!

---

# ఆ ట వి డు పు

మనసుకొరకు ప్రేమించెడి మనిషికొరకు
తుదివరకు నీకు నేనను తోడు కొరకు
పరుగులిడితి, యాచించితి, భంగపడితి,
అలసిపోతిని - కావలె నాటవిడుపు

పదియడుగులు ముందుకు కష్టపడి గమించ
నెనిమి దడుగులు విధి వెన్కకీడ్చుచుండ
ముందు వెన్కల కిగతి మోదుకొనుచు
అలసిపోతిని - కావలె నాటవిడుపు

ముప్పదేడులు బ్రతుకుపై మోజుకొలది
ఒక్కక్షణమైన నెమ్మది చిక్కననియె
మొండిగా నిన్నిబాదల బండిలాగి
అలసిపోతిని - కావలె నాటవిడుపు

ధనము నార్జించి ముప్పాలు దారపోసి
కొంటి కడగళ్ళ పడగళ్ళ నింట, బయట
కోరి తలగోకికొంటిని కొరివితోడ
అలసిపోతిని - కావలె నాటవిడుపు

ఎవరు నావారు, పెరవార లెవరు, పాత్రు
లెవ రపాత్రు లెవ్వారలో, ఎరుగలేక
చెర్చి తల బొప్పికట్టగ నేర్చుకొనుచు
అలసిపోతిని - కావలె నాటవిడుపు

మనసువేనివాడని, బుద్ధిమంతుడనియు,
గోవువంటివాడని, వట్టి క్రూరుడనియు,

రసికులని, వాదులను విని రాయిపడితి
అలసిపోతిని - కావలె నాటవిడుపు

ప్రేమ పరిపూర్ణ హృదయమె పెన్నిధి యని
వరముగా నెంచి, పెంచితి, గరువపడితి,
బ్రదుకునకు దానికిని పొత్తుకుదురలేదు,
అలసిపోతిని - కావలె నాటవిడుపు

దేవుడున్నాడొ లేడొ, ఈ దినమువరకు
నరుని, దేవునిమించియే నమ్మినాను,
అడుగడుగున వాని దగాలననుభవించి
అలసిపోతిని - కావలె నాటవిడుపు

'మోహపారిజాత్య గాఢాంధకారమందు
నిన్ను విడిపోవు కడకు నీ నీడకూడ'
అనెడి సత్యము పలుమారు లనుభవించి
అలసిపోతిని - కావలె నాటవిడుపు

ధనము దాచలేదు, మనసు దాచలేదు
దాచుకోలేదు చేసిన తప్పులైన,
ఎవరు నను పెద్దమనిషిగ నెంతురింక
అలసిపోతిని - కావలె నాటవిడుపు

---

# మబ్బుతల్లి

పాలకడలివలెను ప్రత్తికొండలవలె
మంచుపిండి చందు పంచినటుల
వెన్నముద్దలటుల, వెలిబూది కుప్పలు
పోసినటుల మేఘపుంజ మలరె!

వెండినీరు పూతవేసిన గరువాన
పిల్లమబ్బు మెరసె తల్లిచెంత,
పూచినట్టి యడవి బూరగతీరున
తల్లిమబ్బు రీవి వెళ్ళబోసె

# అరణ్యారోదన

1947 లోనే ఆత్రేయ 'అరణ్యరోదన' అనే పద్య కావ్యం వ్రాశాడు కాని అది ఆయన దగ్గరలేదు, ఆయనకే దొరకలేదు కాగా 1983 లో ఏదో సందర్భంలో అందులో తనకు గుర్తు వచ్చిన కొన్ని పద్యాలను మాత్రం ఆత్రేయ తన మిత్రులకు విని పించడం జరిగింది అవే యీ పద్యాలు

అనుకున్నట్టుల కాకపోయినను
కామ్యార్థమ్మెటో చేత చి
క్కెను దీనాటికి, దాస్యమూడినది,
ప్రాగ్దేవి ముఖాబ్జాన చ
చక్కని నవ్వొక్కటి కందళించినది,
రక్తమ్మోడ్చి సాధించి తె
చ్చినదీ స్వేచ్ఛ, సతమ్ము సర్వజనతా
శ్రేయమ్ముగా వాడుడీ!

దారుణ దాస్యబంధన
విదారణ కంకణధారులైన ఓ
భారత వీరులార! ఇక
పై నిదురింపగరాదు, ఘోర హిం
సారతి నోరు విప్పినది,
సర్వవినాశన వికరాకృతిన్!
జారిన గుండెలార్చినది
సత్యమయోమయ దీనభావమై!

ఉప్పు సత్యాగ్రహాహ్వాన కసుగాయ
బ్రతుకులెన్నియొ రాలిపడిన నాడు

మూటలుగట్టి నిర్మోగమోటముగ మేలి
సీమగుడ్డల బూదిసేయునాడు
ఉరిత్రాళ్ళలో మెడలిరికించి యువకులు
స్వాతంత్ర్యజపముతో చచ్చునాడు
పోలీసు లారీల పూజల గ్రహియించి
కారకు నతిధులై కదలునాడు

నిరుపమ త్యాగశీలగా నిలిపినారు
మహితజాతీయ సంస్థనె మచ్చులేక
ప్రాణబలియిచ్చి తెచ్చిన పాలనమును
మలిన పరతుర? పదవుల మత్తువలన!

వినువారెవ్వ రరణ్యరోదనము —
మా విశ్వాసముందోచి, పె
త్తనముం జేతులబట్టి, కన్నులర
మోతల్పాడ్డ మీ రిప్పు డి
చ్చిన హామీలవి బుట్టదాఖలయెగా!
చేజేత నీ శిక్ష నె
త్తిన మేమే కొనితెచ్చుకొంటి మివియా
దిన ప్రజారక్షణల్?

---

# జీవితము - నాటకము

చిత్ర విచిత్ర దృశ్యములు
        జీవిత నాటక మందనేకముల్,
పాత్రలు, వేషభాషలు
        స్వభావము లాశలు నిత్యనూత్నముల్
మిత్రుడు శత్రువౌ తృటిని
        మేలును కీడొక తీరు తోచెడిన్
పాత్రు డపాత్రుడౌ, ననుగు
        పత్ని పితాగ్నిగ మారు వింతగా!

వెళకు తీసివేసెదరు
        వేషము నాటకమాడువారు, మా
మూలది, ఎల్లవెళలను
        మోమున రంగు నలంది వేషమే
వెళకు నట్లుగా భువన
        వేదికపై నటియింతు రెల్లరున్
కాలమదెప్పుడో యవనికన్
        దిగజార్చు, నెరుంగ రెవ్వరున్

సూత్రధారి యాజ్ఞ చొప్పున ఎల్లరు
ఆడిపాడి మాటలాడువారె
ముగియురీతి ఏదొ ముందుగా తెలియదు
ఆటతుదిని చూచు ఆశలేదు

వెడలిపోవునపుడు వెంటనే తానుండి
సూత్రధారి యొలుచు సొమ్ములన్ని
విడిచిపెట్టవయ్య వేసిన రంగైన
సకలమూడ్చి ఎటకొ సాగనంపు

నాటక మాడుచు, మనమే
నాటకమున ప్రేక్షకులమునై చూచిన ని
నాటక మెట్టి యసత్యము
గాటముగా నాటి హృదిని, కన్నులు తెరచున్

ఎందరిటు లాడిపోయిరి
ఎందరు వేదికకు వచ్చి ఏగిరి వృథగా
ఎందరు శుభమన గలిగిరి
ఎందరు తామేడ్చి పరుల నేడ్పించిరిలన్

లెక్కకు మించిన నటకులు
ఎక్కడి వారెల్ల కలిసి ఎవరికివారై
ఎక్కడికి తరలిపోయిరి?
ఎక్కటి దైవమ్మెరుంగు నిట్టితమాషా!

టక్కరిదేవుని చేతల
నొక్కండును తెలియజెప్ప నోపడు భువిలో
నెక్కడి కక్కడ నాటక
ముక్కిరి బిక్కిరిగ చేసి యోడించు నరున్

---

# రాధ బాధ

ఇదొక వ్యంగ్య రచన కృష్ణుణ్ణి ఉద్దేశించి రాధ చేసిన అధిక్షేపణ రూపంలో - నేటి రాజకీయాలపై ఆత్రేయ విసిరిన విసురు ఇది వ్రాసింది ఎప్పుడో తెలియదు గాని. 1986 'జ్యోతి' పత్రికలో ప్రచురితమైంది

రాజకీయాల కుట్రల రభసలోన
చిక్కువడిపోతి వేల నా చిన్నికృష్ణ!
రాసలీలల తేలిన రసికరాజ!
తగవు నీవంటి వానికీ తగవులెల్ల!

బ్రతుకలేనివారు, పదవుల కోసము
ప్రాకులాడువారు, ప్రజలసొత్తు
మ్రింగి త్రేన్చు వారు, మేకతోల్ కప్పిన
పులులె రాజకీయములకు ఘనులు!

బోడి తలలకు మోకాళ్ళు ముడులుపెట్ట
తిమ్మిబమ్మిని బమ్మినితిమ్మి చేసి
సిగ్గుఎగ్గుల విడనాడి, చిక్కినపుడు
జుట్టు, లేకున్న కాళ్ళను పట్టవలయు

ఇంత చండాలమును లోకశాంతి కొరకు,
ప్రజల సుఖము కొరకు, వారి బ్రతుకు భద్ర
తలకు, ధర్మము ధరణిలో నిలుపుకొరకు
అనుచు నిట్టనిల్వున బొంకులాడవలయు

ఎత్తులకు ఎత్తు వేసెడి జిత్తులరసి
రంగులనుమార్చి బురఖాలు రకరకాలు

తొడిగి విడిచెడి పెసువియ్య తొలుత నెప్పి
గురువుకె నామమును పెట్టి నెరుగవలయును.

రాచప్రణయము ఖోలు రాజకియాలలో
అగులుకొన్నవాడు తాగుబోతు
కన్న హీనుడగును కడతేరిరాలేడు
మదిరకన్న మిన్న పదవిమత్తు!

తిండిలేద? బ్రతుకుతెరువు లేదా నీకు?
పేరు ఊరు లేద? ప్రేమతోడ
నిన్ను కోరువార లెన్నివేలున్నారు!
విడిచిరమ్ము పాడు గొడవలింక

మురళి నెమలూల పత్తైవి మరచినావు
నుదుట కస్తూరి దిద్దుట వదలినావు
సిగను పింఛము లేదు నెచ్చెలులు లేరు
నీలవర్ణమ్ము నలుపాయె జాలిపుట్టె!

కరుడుగట్టిన స్వార్థమ్ము కనులగప్పి
నీతినియమాల నిలువున పాతిపెట్టి
ప్రజలపేర దర్మముపేర పాడుపనులు
సేయు దుర్గతి నీకేల చెప్పవయ్య!

ఆలమందల విడిచి తోడేలు గుంపు
మేపుచుంటివి, తుదకిదే మిగులగలదు
భారతమ్మున కృష్ణుడు పక్షపాతి
గొల్లరేపల్లె బాలుడే గొప్పవాడు!

రాయబారాలు, దర్మసూత్రాలలోని
మతలబులు, చాటుప్రేమల మంతనాలు,
రాజకీయతంత్రాలును, రంకు కతలు
నిండి నీజీవితము నేడు బండబారె!

వాడుకొన్నారు పాండవుల్ వారి వారి
సొంత పనులకు నిన్ను కొండంత పొగిడి!
తుదకు రణరంగమున వైరులెదుట నీకు
తేరు నడిపెడి పనిపెట్టినారు కృష్ణ!

అరయ కౌరవుల్ పదిరెట్లు మెరుగుకాదె?
దేవుడని నిన్ను ఉబ్బించి దేవిరించి
అరవచాకిరి చేయించి అడ్డమైన
కల్లలాడించి గెలుపొంద నొల్లలేదు

---

## ఆటవెలది

మాయూరిదారినే మన్నారు పోలూరు
　　సూళ్ళూరుపేటకు చూపుదూర
మచట వేంచేసె ప్రత్యక్షదైవమ్ము శ్రీ
　　వేణుగోపాలుండు, వేంకటగిరి
యాచేంద్రభూపతు లగ్రహారము లిచ్చి
　　నిత్యకైంకర్యముల్ నెరపుచుండ,
బ్రహ్మోత్సవంబులు పర్వదినమ్ములు
　　ఉభయకర్తలు పూని విభవ మలర

జరుప స్వామి సన్నిధి వీధి కిరుకెలకుల
అర్చక పురోహితాగమాధ్యాపక కవి
పండిత ధరణీసుర గృహప్రాంగణమ్ము
లక్కచెల్లెంద్ర కాటపట్టనగ నుండె

విప్రవీధికి వెన్క వెలయు వేశ్యావీధి
　　విలువతేలని సొగసులకు ప్రోడి
నృత్య సంగీత సాహిత్య కళావేది
　　రసిక పండిత కవిరాడ్వినోది
దైవకైంకర్య సద్ధర్మపాలన మోది
　　నిజవృత్తి నర్తన నియమవాది
శృంగారకేళికా క్షీరాబ్ధి రససిద్ధి
　　సురుచిర చతుర వచస్సమృద్ధి

సకల భవభోగ వైభవ సౌరభనిధి
తరుణబింబోష్ఠనిత్యనూతన సుధాబ్ధి
ముగ్ధలావణ్య లాలిత మోహజలధి
యౌవనావేశ మత్తగజాంకుశమది

పగలెల్ల చీకటుల్ ప్రాపులే కతివల
      కురులందు శరణంది కుదురుకొనగ
సాయంతనము వాని చక్కగా దువ్వి, వా
      ల్జడల ముప్పాయలో ముడిచివేసి
ఒలకమాడి పలుచ చలువకోకలు కట్టి
      బొట్టుకాటుక, దిష్టి బుగ్గచుక్క
దిద్ది, మల్లెసరాలు ముద్దుగా జతదాల్చి
      అదరాల తాంబూల అరుణిమలది

విరకాంతలు వాకిట యోర యోర
చూపుతూపుల విసరుచు సొగసులెల్ల
బయటపడినట్టు పడనట్టు పైటకొంగు
జారవిడిచి పైకెగద్రోయు జాడజూడ

పదియేండ్ల వానికి పరువమ్ము పొడచూపు
      నూరేళ్ళ ముసలి నోరూరజూచు
పుట్టునపుంసకు పట్టియూపు మరుండు
      బిచ్చగాడును ప్రేమబిచ్చమడుగు
ప్రవరాఖ్యుడంగజ ప్రవర వల్లించును
      శుకమహర్షియు భోగసుఖము కోరు
బ్రహ్మచర్యము వృథా భ్రమయనున్ భీష్ముండు
      శ్రీరాము డెకపత్ని చెల్లదనును

పదియునారువేల భామల కృష్ణుండు
లెక్క కోటికెక్క లెస్సయనును
పలుకులమ్మకొసగు బ్రహ్మ విడాకులు
భార్యయనగ భూతుపలుకె యగును

ఒకయింట నట్టువు నొద్ద నట్టువ సాద
      నొకయింట పాటల యొజ్జనమ్మ
ఒకయింట జావళీ లొకయింట కీర్తన
      లొకయింట మేళాలయొద్దికలును

ఒకయింట కవివరేణ్యుల కావ్యశ్రవణమ్ము
ఒకయింట సరసుల యుబుసుపోక
ఒకయింట జూదాల నొడ్డెడి రభసమ్ము
ఒకయింట పడకింటి యుక్తిబోధ

వృద్ధమాతల గతవిభవపారాయణము
పడుచువారి రాత్రి ప్రణయస్మరణము
కన్నెరికము సేయు మనుల యన్వేషణ
వెలుగైన వేశ్యవాడలోన

ఆటవెలది వెల దిగంతాల కెగప్రాకు,
ఆరు నేడు నడుమ ఆటుపోట్లు
పడును, పిదప బేరమగును గంటకు
అగిన బొంత ఏదొ తవిలినంత

పుచ్చుకొంటి తాంబూల మీ ప్రొద్దునంగ
కుదిరెనారేయి యొకనితో కూటమి కని
వెలవెలంది మప్పితముగ తెలియబలుకు
పారిభాషికపదము మా ప్రాంతమందు

పంద చేకొని తాంబూలమందుకొన్న
పిదప వెలవేలకుతూగు బేరమేని
'ఇపుడు పొసగదు మనసైన ఎడల తమరు
ఎల్లి దయచేయు'డను నీతి చెల్లెనపుడు

సానులన్న నీచజాతిగా నూహించు
నేటివారెరుగరు నాటి నీతి
వార కాంతలపుడు వ్యభిచారిణులు కారు
కామయజ్ఞమునకు కారు పసులు

భోగకాంతలంచు పొందిరి యశమును
లలితకళల భోగులగుట వలన,

వాసిగనిరి కళావంతుల పేరిట
జాణలైరి మాటచతురువలన

పతులవలన తమకు సంతృప్తి కలుగమి
పతులు వత్తురు వెలపడతి కడకు -
కొరతనెరిగి వారి కోరిక మేరకు
తనివి తీర్చుట కులధర్మమనుచు

ఇది పవిత్రవృత్తి, ఇది సంఘసంక్షేమ
కార్యమన్న నమ్మకమ్ముతోడ
నీతి నియమబద్ధజాతిగా జాతిని
కాముకాగ్ని నుండి కాచువారు

కన్నెవయసు దైవకైంకర్యమున కంకి
తమ్ముచేసి గుడికి వత్తుచేసి
ముద్రవేయబడిన ముద్దరాలికి దేవ
దాసి యనెడి పేరు వాసికెక్కె

ప్రొద్దు ప్రొద్దు గుడికి పూజవేళను వెళ్ళి
భగవదర్పితముగ భక్తి కీర్త
నార్థములను భరతనాట్య భాష్యమ్ముతో
నభినయింతురు పరమార్థ బుద్ధి

మాన్యములును, దాస మర్యాదలును, రోజు
సాపడంగ సామి సాదములును,
పొంగలి పులిహోర పొంగలి దధియును
వారికెల్ల యుత్సవాల యందు —

సంపకెత్తి పంపి గౌరవించుట నాటి
సంప్రదాయమగుట, జాతికులము
కన్న విద్య మిన్నయన్న సద్భావమ్ము
తారతమ్యములను తరిమివేసె!

హాస్యమాడుకొనుచు, ఆత్మీయులై వావి
వరసలల్లుకొనుచు వయసు తప్ప
అన్యమైద భావమావంతయును లేక
కలిసియుందు సత్యకాలమద్ది

విద్యకును కళలకు విలువ ఎక్కుడుగాని
మనసు మెచ్చినపుడు తనువునిచ్చు,
ఆలుమగలకన్న అన్యోన్యముగనున్న
జంటలెన్ని సాని జాతిలోన

తేటగీతి వంటి ఆటవెలది తోటి
వెల కుదుర్చుకొన్న విటుడుసుంత
అభిరుచిగల రసికుడైనచో చాలును
అత్తయింటి కొత్తయల్లుడగును

తలకు నూనెపెట్టి నలుగుపిండి నలంది
ఒడలు రుద్దునపుడు ఒడుపు తెలిసి
తొడలపైకి చీర తొలగించి బిగగట్టి
రవిక విడి కుచములు రాపిడిపడ

వంగి, వంపుల లతికాంగి సర్వాంగముల్
తలిరువేళ్ళ తుదల తడిమి తడిమి
కితకితలను పెట్టి కిటుకుల పసిగట్టి
వేడి తగ్గుననుచు వేడినీళ్ళు

కొసరి కొసరి పోసి, కోడెవయసువేడి
కొలిచి తెలిసికొనెడి మెలకువలను
ఉగ్గుతోనె నేర్చుకొన్నది చిన్నది
వృత్తివిద్యకన్న విద్యఏది?

స్నానము ముగియించి తల తుడిచెడిలోన
బయటపడును విటుని బైసి కాస్త,

ధనముకన్నను మగతనమునె మెచ్చును
సతియెగాని వారసతియెగాని

కొత్తవస్త్రములను కొనితెచ్చి కట్టించి
ఇంటగాని విప్రు లింటగాని
పంచభక్ష్యములను వడ్డించి, తినిపించి
పట్టె పాన్పు జేర్చి, పదము లొత్తి

జాజి ఏలకలును జాపత్రి కస్తూరి
పచ్చకప్పురాల పరిమళాల
తలిరు తమలపాకు చిలుకలందించుచు
మంతిరించు మదన మంత్రములను

ఆటవెలది పాడు తేటగీతములెన్నొ
ఆటవెలది చిలిపి ఆటలెన్నొ
ఆటవెలది పెదవి తేటతేనియలెన్నొ
ఆటవెలది పోవు అలుకలెన్నొ
ఆటవెలది సేయు అంగజక్రియలెన్నొ
ఆటవెలదికున్న ఆశలెన్నొ
ఆటవెలది ముద్దులాడు రకాలెన్నొ
ఆటవెలది నేర్పు పాటులెన్నొ
ఆటవెలదికి గల అనుభవాలెన్నెన్నొ
ఆటవెలపెగుండె గాటులెన్నొ!

---

# చాటువులు

ముదుసలై పుల్లయ్య మూల పడ్డాడయ్య
బూతుల కెక్కడ పోదునింక?
మధుసూదనుడు సినిమాలు తీయుటమానె
అన్నపూర్ణ నికెమి అడుగగలను?
జగతిపతి గుండెలు జార్చెను కొంగు బం
గారమైయుండెడు మనుజెవండు?
ఆదుర్తి చెరినా డమరపురంబు
కామైత్రి కెవ్వాని నాశ్రయింతు?
సరసులనుమాట నల్లపూసాయె నేడు
చిత్రజగతికి పట్టెను చెదపురుగులు
అపరశ్రీనాథు డాత్రేయు డన్నమాట
సార్ధకంబాయె నా అగచాట్లవలన,

'అర్ధాంగి'తోడ వాగర్థమ్ము చవిచూపి
'దీక్ష'తో పాటలతీరు మార్చి
'మూగమనసు'ల రాగాలు పసిగట్టి
ప్రతినోట పలికెడి పాటలల్లి
పల్లెపదాలలో ప్రణయసౌరభమెల్ల
'జగపతి' చిత్రాల జాలువార్చి
రసమయ కావ్యమ్ము రతనాల సౌదమ్ము
'ప్రేమనగర'ను కీర్తిని గడించి
మాటపాటలనల్లు మాంత్రికుండనుపేర
సవ్యసాచిగ సినీజగతినేలి
లక్షలార్జించి ధనము నలక్ష్యపరచి
ఖర్చుచేసితి స్వపర సుఖాలకొరకు

ప్రొద్దు గుంకెడి వయసున బొక్కసాన
లేదు చిల్లిగవ్వైన నన్నాదుకొనగ

ఎటుల వచ్చెనొ పోయినదెటులొ దాని
అడుగు జాడలు స్మృతిపదమందు మిగిలి
అప్పుడప్పుడు చేసెడి చప్పుడులకు
ఎడద లోతుల విషమంట లెగసియాడు

కొనుటన్నదిక మనుకొనుటకే వీల్లేని
ఇంటిని తెగనమ్ముకొంటి నాడు
అయినంత నా నెత్తురాకొని జుర్రెను
కాబూలి బెబ్బులి ఖానుగాడు
ఇప్పుడు పాతిక నెప్పుడో వడ్డీగ
కొల్లగొట్టెను అమికుల్లగాడు
పెద్దయల్లుడు ప్యోతి పీకకే తెచ్చెతి
'ఆంధ్ర BANCARD'పై అప్పు చేసి

పొలము పొలమని కలగని మోసపోతి
విత్తనమకు నె కీర్తిశేషుడైతి
పాపమటంచు పెరుగు ఋణభార మెట్టుల
తీర్చుకొందును, నను కడతేర్చుకొందు!

పెట్టుతొట్టించినదియున్న పేరు మిగుల
ఆరువదెకరాల పొలమున్న దయ్యానాకు
ఎముక కొక గోరి లెక్కన ఎన్నియేని
కట్టుకొనవచ్చు నా వల్లకాటిలోన

---

# నా జాతకము

ఆత్రేయ తనజాతకాన్ని ప్రాచీనపద్ధతిలో పద్యరూపంలో వ్రాసుకున్నాడు ఇది 1965 డైరీలో మే 7వ తేదీ (తన పుట్టిన రోజు) ఎంట్రిలో దొరికింది ఇందులో గ్రహాల పేరులన్నీ అచ్చ తెనుగులో వర్ణించాడు దీని సారాంశం ఆత్రేయ అమావాస్య రాత్రి జన్మించాడు ఆయనది ధనుర్లగ్నం, భరణి నక్షత్రం మేష రాశి తల్లికి మొదటి కానుపు బుద్ధిస్థానమైన పంచమంలో - అంటే మేషంలో — రవి చంద్ర, బుధ, కేతు, శుక్రులు, సప్తమస్థానమైన మిథునంలో కుజుడు, నవమస్థానమైన సింహంలో గురు, శనులు, ఏకాదశస్థానమైన తులలో రాహువు — ఇదీ గ్రహ సంపత్తి కొంతమంది పాఠకులకైనా ఇది ఆసక్తికరంగా ఉంటుం దనే అభిప్రాయంతో దీని నిక్కడ పొందుపరిచాము — సం॥

నిండు చికటి నిసి రెండవరిక్కలో
విల్లు లగనమునకు నిల్లుగాగ
తొల్తనెలను అమ్మ తొలిచూలు బిడ్డగా
అవతరించినాను అవనిమీద

వింటి కైదైన మేకపోతింటిలోన
పగటిరేడును, రేరేడు, పాముతోక
రక్కసులయొజ్జ, జాబిలి రంకుకొడుకు
చేరి బ్రతుకును చింపరచేసినారు

ఇంగిలదొర చేరె నేడింట నొక్కడె
అడవిరాజు గూట నమరియుండె
వెల్పులయ్యవారి వెంట కుంటిదొరయు
తక్కెడింట పాముతలయు వెలసె

## ఇతర పద్య రచనలు

అయిదు గ్రహములు కూడి సన్నారుమూడు
దారులకు లాగి చెడిపె నా తప్పుగాదు

తులను రాహువుండి తులలేని దనమిచ్చి
రండసంతు గూర్చి రట్టుచెసె

గురువులేని నాకు గురువు తొమ్మిదిలోన
నుండి కాచెనంట యొడుదుడుకులు!

ఇవికూడా ఆత్రేయ డైరీలనుండీ, అడపాదడపా గిలికిపారేసిన ఎక్సర్‌సైజ్ పుస్తకాలనుండీ సంపాదించినవే ఇం దులోని గేయాలు ఒకటి, రెండు తప్ప మిగతావేవీ ఇంతకుముందు ప్రచురితం కాలేదు ఆత్రేయ సినిమాపాటల ధోరణికంటె భిన్నమైన Thought Patterns యీ గేయాలలో గోచరిస్తాయి కాగా, గేయాలకంటె చిన్నవై, భావగర్భితమై, Quotable గా ఉన్నవాటిని 'సూక్తులు'గా వర్గీకరించాము ఈ రెండు రకాల రచనలూ పరితల్ని ఆకట్టుకుంటాయని మా నమ్మకం — సం॥

## కాలం!

ఎన్నో యుగాలుగా ఉన్నాను
ఇంకెన్నో యుగాలు వుంటాను
పన్నెండు నెలల్లో బ్రతికే నువ్వా
నాకు కొలమానం

ని ఆయుర్దాయం నిర్ణయించింది నేను
నీకు పేరుపెట్టింది నేను,
నీకు పేరు తెచ్చేది నెను
నివ్వు చరిత్రగా మారేదీ నా చర్యవల్లనే,
ని గర్భంలో కలిసిపోతానని గర్వించకు
దాన్ని ఛేదించుకొని వచ్చె అవిచ్ఛిన్న
శక్తిని నేను

నీ గర్భం నాకో మేకప్‌రూం
ఒ డ్రస్సింగ్ రూం
విరామస్థలం
విశ్రాంతి గృహం 'అంతే'!

---

# మనసులో దాచుకో!

పెద్దపాపా
పిచ్చిపాపా
మాట ఒక్కటి చెప్పుతాను
మనసులోనే దాచుకో!
మళ్ళీ మళ్ళీ తలచుకో!
మంచిపేరు తెచ్చుకో!

జనాబా జాబితాలో
మనుషులంగా మేము కూడా
లెక్కకొచ్చాము।
భావిభారత పౌరులైన
బాలలందరి భవిష్యత్తు
మలచవలసిన ప్రభుత్వానికి
మంత్రివర్యుల నెన్నుకొనుటకు
ఓట్లు వేసాము!
పాట్లు చూసాము!

సత్యమేదో
అసత్యమేదో
నీతి ఏదో
నిక్కచ్చిగా నీకు మేము
చెప్పలేక మా
తప్పులన్ని
కప్పిపుచ్చి
అప్పుడప్పుడు నీకు మాత్రం
తప్పు చెబుతూ

నిష్ఠారాలు
భ్రష్టపథములు
కష్టరథములు
సృష్టికే వికారాలు

మానుంచి నీవు నేడు
నేర్చుకోవలసినట్టి
మంచిపని లేదులే
మాకె అది తెలియదులే!
మా దారిలోన నీవు
పయనించాలనుకోకు!
మా మాటలు వేదమని
మననం చెసుకోకు!
మా కుంటి జీవితాలు
మలినమైన వస్త్రాలు
వాటినే తొడగకు
దుర్వాసన కలవాటుపడకు

మా చితుకు జీవితాలు
చేతలేని నీతులు
చెత్తపోగు గోతులు
చింపిరీ పాతలు
రంపపు కోతలు

అందమైన జగతిని
భయంకరంగ చేసినాము
ఆనందమంటే స్వార్థమే అను
అర్థము సృష్టించినాము
అబద్ధానికీ నిజానికీ
ఊడుపుటొకటి తొడిగినాము
శాంతి పేర

క్రాంతి పేరు
పైవమని
ఎల్మమని
పెట్టి పెట్టి యుద్ధాలె
చేసినాము
విజయోత్సవాలకు
మృతవీరస్మృతులలో
విర్రవీగిపోతూ
జరిపినాము
నిలిపినాము

ఎదుట నిలిచి ఎప్పుడూ
వెనుక నుంచి పొడిచే
వేడిశక్తి వెడగా
మాదేను ధర్మము
మాదేను విజయము
మాది యీ లోకము
మేమే మనుజులము
మేమేనని అరిచినాము
మేలంతా తుడిచినాము
కాల మిర్రి గడిపినాము
రాలిపోవు కాలమునకు
జాలిచూపు వి వరినాము
మంచాల త్వరిపెడితె
మార్పులచేయులమైనాము
మంచిగా యిక ఉంటామని
బ్రాంతిన్నో చేసినాము —
కాలగర్భమందు
ఒదగక
కలిసిపోపువారము
M 10

వెళ్ళిపోపువాళ్ళము
మళ్ళీ రాని రాక్షసులము
పిల్లలను కన్నవాళ్ళము
ప్రేమ అనే విసరుతో
పీకుతున్న పెద్దలము
చివరి మాట చెప్పము
చెప్పకుండ పోతాము

ఇదె ఇదె ధర్మము
ఇదె ఇదె సత్యము
ఇదె ఇదె న్యాయము
ఇదె ఇదే దైవము
ఇదే మంచిమార్గము
ఇదె దివ్యస్వర్గము
అనం అనం, అనలేము!
ఆ అధికారం అర్హత
లేని లేకివారము

అయినా
ఒక్కటే ఒక్కమాట
గతం తెలుసుకోండి
ప్రస్తుతం పరిశీలించండి
ఏం చేసినా మీది యీ లోకము
మీదనుకుంటే స్వర్గము
కాదనకుంటె నరకము
ఏమైనా చేయండి
ఎటులైనా ఏలుకోండి
మంచి నెపుడు పెంచండి
మనుష్యులుగా బ్రతకండి

# చిన్నిపాప

చిన్నిపాప నవ్వులో
ఉన్న మైకమేమిటో?
నన్ను నేను మరిచిపోయి
చిన్నపాప నౌతాను

చిన్నిపాప పిలుపులో
ఉన్న మత్తు ఏమిటో
అన్నెమన్నదే మరచి
నాన్ననైపోతాను

చిన్నిపాప మాటలో
ఉన్నతీపి ఏమిటో?
పెద్దపెద్ద బాష మరచి
ముద్దుమాట లాడుతాను

చిన్నిపాప చూపులో
ఉన్నదీప మేమిటో
ముసురుకున్న చీకటిలో
ముందుకే వెళ్తాను!

చిన్నిపాప ఆటలో
ఉన్న పాశ మేమిటో!
పొద్దు మరచి దానిచేత
బొమ్మనైపోతాను!

చిన్నిపాప నడకలో
ఉన్న అంద మేమిటో
పరుగులెత్తు వయసు కూడ
పెళ్లినడక నడుచుము

వంచక ప్రపంచాన
పెంచుకొందు ముసిలితనం
చిన్నిపాప చెలిమిలోన
తెచ్చుకొందు పిల్లతనం!

దినమంతా అరిగి అరిగి
అలిసిపోవు బ్రతుకునకు
క్షణంపాటు పాపతో
గడిపితే శతాయువు!

---

# నేను

ని అందానికి నే బందీని
నీ మనసుకు దాసుణ్ణి
నీ చూపులకు పావణ్ణి
ని మమతలకు మత్తుణ్ణి

ని కురులకు నే కుసుమాన్ని
నీ పెదవికి దరహాసాన్ని
నీ అడుగుల అందెల సందడిని
నీ గుడిలో నెను పూజారిని

నీ చెక్కిలిపై నొక్కను నెను
నీ చెలిమితీగ పందిరి నేను
నీ నడకలలో కులుకును నేను
నీ అడుగులలో అడుగును నేను

నీ నొసట ఆడు ముంగురు లేను
నీ వయసు పసిడి రంగును నేను
నీ అలుకలోని వేడిని నేను
నీ అలుపుతీర్చు చలువను నేను.

నీవూ నెనూ నిత్యమని
నీ అనురాగం సత్యమని
నీపై తలపు పవిత్రమని
నమ్మినవాణ్ణి నీవాణ్ణి
వలదన్నా వలచేవాణ్ణి
వద్దన్నా వ్రాసేవాణ్ణి
మరణించే బ్రతికేవాణ్ణి
నీ మనసులోన అమరుణ్ణి

నా ఎద నిండు భక్తివని
నాలో కవితా శక్తివని
నన్ను వరించిన ముక్తివని
నమ్మినవాణ్ణి, నివాణ్ణి
ప్రేమించుట నీకోసంకాదు
ప్రేమించక జీవించుట చేదు

* * *

అంచ నడకలు విన్నాను
మంచుకొండలు కన్నాను
ఆ కులుకులను ఆ చలువలను
నీలో అణువణువున చూచాను

మావి చివురును చూచాను
మంచి కెంపును కన్నాను
ఆ నునుపులను ఆ విరుపులను
ని మోవిలోనె చూచాను

సంజ వెలుగును చూచాను
సాగరాన్ని కన్నాను
ఆ సౌందర్యం ఆ గాంభీర్యం
నేడు నిలో చూచాను

కలత నిద్దురలోన
కలలాగ వచ్చి
కబురులెవో చెప్పి
కరిగి పోబోకు!

కలకాలమూ నాతొ
కాపురం ఉండే
మమతగా మారి నా
బ్రతుకునె తీసుకో!

నెను నిన్ను చూసినపుడు
నివు నెల చూస్తావు

నేను నింగి చూచినపుడు
నీవు నన్ను చూస్తావు
ఇద్దరి చూపులు కలిసినపుడు
ఏమవుతుందో చూద్దామా?

కల కాబోలనుకున్నాను
నిజమేనని నివన్నావు
నీ మాటే నమ్మాను
నువు నిడగ మారావు
నిడగ మారిన పర్వాలేదు
మారని నీడగ వుంటే చాలు
పొద్దునుబట్టి మారక ఉంటే
ఇద్దరముంటాం వెయ్యేళ్ళు!

---

## తెలివి

విడిపోయి తెలుసుకొంటిని
కలిసుండు టెంత బాధని
ఆనాడు ఎరుగనైతిని
విడిపోతె ఇంత సుఖమని
నీకు ప్రేమన్న చెరుకలేదని
నిన్ను ప్రేమించి తెలుసుకొంటిని
అసలు ప్రెమించుటే పెద్ద తప్పని
నిన్ను ద్వేషించి దిద్దుకొంటిని

---

## ఒకటి

ఏం కావాలి!
ఈ జాజితీగ ఎవరికి పూయాలి!
నీ పేరిట వేసానె
నీ ప్రేమవలె పూచింపె
నీ జతకె కాకుంటే
నువ్వు జతగా లేకుంటె - ఏం కావాలి!
నువ్వులేని సమయంలో
కవ్వించాలని కోపంలో
మొగ్గలు తొడిగి
నిన్ను అడిగితే
సిగ్గున బదులేం చెప్పాలి?
రాలిన పూలు
గాలికి పోక
వాసన చూడక
వాడనివ్వక
పోగులు పోసి
నీ గుడికెసి
పూజవేళ ప్రతిరోజూ చూస్తా
వేచి వేచి ఇవి విరబూస్తాయీ
కాచి కాచినే కన్నీరవుతా
అప్పుడు ఏదో చప్పుడు అయితే
తప్పక నువ్వే అనుకొంటూ
తత్తరపడుతూ పరుగెడతా
అడుగుజాడలే అగుపిస్తాయి
ఆఖరు పువ్వు అపుడర్పిస్తా!

---

## రెండు

ఎంతకాలం
ఆడుతారీ నాటకం?
ఎంత కాలం
సాగుతుందీ బూటకం?
కళ్ళు వుండీ గుడ్డివాళ్ళుగ
ఎంతకాలం ఎవ్వరుంటారు?
గుండె రగిలిన గుడ్డికన్నె
కురియు నిప్పుల కుప్పలు,
కనాలగలవీ తెప్పలు!

ఏరుదాటి తెప్పకాల్చే
తెలివి మీదేనా
ఎదుటివారి నెత్తిమీద
తప్పు రుద్ది దబాయించె
దమ్ము మీదేనా?
జయమ్ము మీదేనా?

---

# నీడలు

ఆపె ఆపే నీడలు!
ఆహా ఆహా నీడలు!
గోడలపై నీడలు
నీడలలో నీడలు!
గోడలేని నీడలు
నీడపడే గోడలు!
గోడల నీడల
గోలలూ గోడులూ!
ఆట ఆడ నీడలు
ఆడుకునే నీడలు
ఆడువారి నీడలు
ఆడతోడు నీడలు!
తోడు కొరకు నీడలు
జోడు కోరు నీడలు
తెలివిగల నీడలు
దెయ్యాల గూడులు
దివిలోన భువిలోన
ఎవరెరుగని నీడలు
పరచుకునే నీడలు
పరువెత్తే నీడలు
పడుచుదనం జాడలు
పరువంలో క్రీడలు!
తారాడే నీడలు
తలుపు తీయు నీడలు
తలప్రక్క నీడలు

తలతిక్క ఆటలు!
కనిపెట్టే నీడలు
కనిపించని నీడలు
కాపలా నీడలు
కనులు చూపు జాడలు!

నీడలన్ని ఏకమై
నిలబెట్టే నీడలు
నీకు నాకు బోధపడని
నిలిరంగు నీడలు
నిజానికి నిలుచోను
నీడివ్వని నీడలు
నిశసైతం నిద్రపోని
నీతికి ఎదురీతలు
పగటిపూట సెగకు కూడ
భయపడని నీడలు
పగబట్టిన నీడలు
పడగెత్తిన నీడలు
కుళ్ళుచున్న పాపాలకు
కూలుచున్న గోడలు
కుటిలులకు జటిలులకు
ఖుషీఖుషీ ఆటలు!

నిడలు పీడలు
పీడపీడ నీడలు
పీడల నీడలు
నీడల పీడలు
పీడించి పిల్చివేయు
పిశాచాల నీడలు
నిశాచరుల నీడలు

పొంచివచ్చు నీడలు
వంచకుల దాడులు

ముసుగుల్లో ముద్దులు
ముద్దు ముద్దు గుసగుసలు
గుట్టుగుట్టు కోరికలు
కోర్కెల అభిసారికలు

చీకటిలో నీడలు
నా గదిలో నీడలు
నా హృదిలో పీడలు
నలిపివేయు గోడలు
నరకంలో నీడలు
నరహంతల చేతలు
నమ్మకకు వాతలు
కలవంటి నీడలు
కాముకుల క్రీడలు!

నిడలు నీడలు
చెలిమిపాలి చీడలు
చిగురురాని మోడులు
సిగ్గులేని ప్రౌఢలు
చివికిపోవు పావడలు
గుండెలోన గునపాలు
పండుచున్న పాపాలు
వినిపించని తాపాలు
వీగిపోని శాపాలు
చివరి కీ నీడలు
చెల్లని మాడలు
నిడలు పీడలు
గోడలు క్రీడలు

జాడలు జోడులు
వట్టివల్లకాడులు
వెలుబూది పాడులు
పాడు నీడ పీడలు
పాడు పీడ నీడలు
పరమ పాప పీడలు
పిచ్చిపేక మేడలు!

పాత నీడలు
రోత నీడలు
ప్రతిదినం అవే నీడలు
పచ్చిపచ్చి బూతునీడలు
పరవశించి
మతి చలించి
పరువు మరచి
భయం విడిచి
మదం హెచ్చి
మనసు పుచ్చి
క్షణం నిలిచే
సుఖం కోసం
అంతరాత్మను
గొంతు నులిమి
ఎదటి హృదయం
రణం చేసి
రక్తబాష్పాల్
త్రావి త్రేన్చి
ప్రవర్తించె
ప్రలోభించే
ఉడుకు తీర్చే
దుడుకు చేసే

పాపి కొండల
రూపు నీడలు!
రేపు మాపులు
రేగి సాగే
ఊరకుక్కల వంటి నీడలు!
అవే నీడలు
అవే అవే పాడు నీడలు
అహెూ అహెూ పీడ నీడలు

---

# ఓ ని రు పే దా !

ఓ నిరుపెదా!
చిరిగిన జీవిత వస్త్రం
మడిచి మడిచి ఎన్నాళ్ళని కడతావు
కాలప్రవాహంలో
పుతికి పుతికి ఎన్నాళ్ళని కడతావు?
ఒక చిరుగున కతుకు వేస్తే
మరొక చిరుగు అగుపిస్తూంది
ఒక మురికి మచ్చ మాపేస్తే
మరొక చోట కనిపిస్తూంది
చిరుగులతో అతుకులతో
మచ్చలతో మాపులతో
చిరకాలం గడపాల్సిందేనా
జీవిత మిలాగే జరగాల్సిందెనా
ఈ చిరుగులకు అతుకులకు
ఎవరు కారణమో ఆలోచించావా
నీవు కావు
ని పేరిట బ్రతికే పెద్దలు!
ని ఒటుతోటి నిలబడిన పదవులు
నీ శ్రమకు జాలి పడుతున్నట్లే
నీ చెమటను తుడుస్తున్నట్లే
నటిస్తూ, ఉపన్యాసాలిస్తూ
నీ తలపై ఎక్కి
నీ బరువును దింపుతామని
వాగ్దానాలిచ్చే వాగుడుకాయలు
రాజకీయ వ్యాధులు!'

తెలియక తల వంచావో
తెలిసి అనుభవించుచున్నావో
ఏదైనా ఒకటేనయ్యా
ఇక సాగనిస్తే చావేనయ్యా
ఎదురు తిరుగు తల ఎత్తి
ఎదనిండా లక్ష్యం రగిలించి
నీ లక్ష్యం ఒకటే కావాలి
ఈ రాజకీయాలు నిర్మూలం కావాలి
ఈ నాయకులను నాగలికి కట్టాలి
అప్పుడే స్వరాజ్యం!
అప్పుడే వాళ్ళనే రామరాజ్యం!

---

# నరహోమాగ్ని

ఆరుస్తారా? ఓరుస్తారా?
నైజాం రేపిన నరహోమాగ్నిని —
ఆంధ్రరాష్ట్రము కావాలంటు
తొంబది లక్షల్ తోసేస్తారా?

ఆంధ్రుల మంటూ కబుర్లు చెప్పుతూ
ఆంధ్ర పౌరుష మ్మమోఘమంటూ
తెలంగాణాన్ని బలియిస్తారా?
కలకాలం ఇటు పడివుంటారా?

మూతిని మీసం మీ కుంటేను
ముందుకు ఇపుడే రమ్మంటాను —
ఆంధ్ర శౌర్యము ఆరకవుంటే
అడుగు ముందుకే నడవాలోయ్!

విని వూర్కుంటె మనకేమంటే
ముందుకు ముందుకు ముప్పొస్తుంది —
తెలంగాణలో కలిసి పోరితే
తెలుగు ఉద్యమం గెలిచిందోయ్!

కమ్యూనిస్టులు కదలించారని
కాంగ్రెస్‌వారు ఊర్కున్నారని
పార్టీలంటూ కక్షలు అంటూ
ప్రజా ఉద్యమం పడదోస్తారా?
పడదోస్తారా? విడిచేస్తారా?

---

(1948 విజయవాడ 'ప్రజాశక్తి' ప్రచురించిన 'తెలంగాణా స్వాతంత్ర్య గీతాలు'నుండి) —

# బ ం డీ

బోసినోటి నవ్వు చూచి
బంటి నైతిని
బుడు బుడుమను నడక చూచి
పొంగిపోతిని
వచ్చి నన్ను పిలిస్తే
ముగ్ధునైతిని!

కావాలి నాన్నంటే
కరిగిపోతిని!
కన్నీరు పెట్టినపుడు
కలగిపోతిని
ఎన్నివేల మైళ్ళైనా
ఎగిరివస్తిని
నీచుట్టూ తేటివలె
తిరుగుచుంటిని!

బోసినోట పళ్ళొస్తె
ముత్యాలను కొంటిని!
బుజ్జి బుజ్జి పాదాలకు
బూట్లు తెస్తిని!

పరుగెడితే పడతావని
భయం పడితిని!
పసిడిబొమ్మ బోసి అని
పందెమేస్తిని!
ఎవరైనా కొర చెపితె
మండిపడితిని!

ఎందరేమన్న నీవె
అందమంటిని
ముందుకాళ్ళ కి బోసి
బంధమంటివి

నిన్నుగూర్చి ఎన్నెన్నో
కలలు కంటిని
నిన్నెంతో చక్కగా
పెంచాలనుకొంటిని
విద్దెలన్ని నెర్పి నిన్ను
పెద్దదాన్ని చెయాలని
ని పేరు ని గొప్ప
చూచి కన్నుమూయాలని
నితోటే నా పెరూ
నిలిచిపోయి కలకాలం
ఉంటుంచనుకొంటిని
ఉబ్బిపోవుచుంటిని!

బ్రతికినందు కది ఒకటే
మనిషిగా అది ఒకటే
మంచిపని అనుకొంటి
మమత నిటే పెంచుకొంటి
ఎమంటావ్ బోసులు
ఏం చెస్తా వాశలు?

---

## కాగితాల ఏడుపు

అడుగు గడప దాటగానె
అగుపిస్తుందొక పటము
అటు తిప్పి తగిలించండి
ఇటువైపే మిగిలిందండి

నల్లనీ సిరాతోటి
ఇన్నేళ్ళూ ఖరాబుచేసి
నే రచించి చించినట్టి
కాగితాల దస్తరాలు
నవ్వుతాయి ఏడ్వలేక

ప్రతి ఒకడూ కవియై మా
బ్రతుకులకు మసిపూసి
పారేస్తాడిలా మమ్ము
పొగిడేస్తా రీ జనమ్ము

కవి వ్రాతల చేదు త్రాగి
కసలెక్కిపోయాము
కట్టుకోండి పొట్లాలు
రుచి చూస్తాం మిఠాయిలు!
అంటాయి మీ చెవిలో
ఆ సాయం చేయండి

కావిరంగు ఎక్కివున్నా
కనీసం ఇప్పుడైనా
పనికొస్తాయ్ పసిపిల్లలకు
అది వరమా కాగితాలకు

---

# గొంతులేని గోడు

1974 ఫిబ్రవరి 11 న పగలు 11-30 లకు అమరగాయకుడు శ్రీ ఘంటసాల వేంకటేశ్వరరావు అస్తమించారన్న దుర్వార్త వినగానే కలిగిన ఆత్రేయ హృదయస్పందన యిది—— ——సం॥

నా కవితకు కంఠం పోయింది!
నా మాటలకు మాట పడిపోయింది

నా తునకల పలుకులను
తేనె చినుకులుగా చిలికిన
దివ్యగాత్రం క్షణమాత్రంలో
దివంగతమైంది!

తెలుగునాట నా పాటలను
ప్రతినోటి మాటగా మార్చిన
గాంధర్వం గగన కుసుమమైపోయింది!
మృత్యు శీతలహస్తం సోకగానే
మూగపోయింది!
ఇంక నేనేం వ్రాసినా
ఎవరు పాడినా ఏముంది?

ఘంటసాలా!
గాన కళాలవాలా!
నేను చూడలేదు, చూడలేను
నీవులేని నీ వదనాన్ని!
నేను చూడలేదు - చూడలేను
నిన్నువతలకు పంపి
అపమృత్యువు నాహ్వానించిన

ఆ పంచభూతాల గేహాన్ని
కర్మ సంచిత దేహాన్ని!

అందులో ఏముంది?
అది వట్టి బొందె
నేడు మాలలు వేసినా
రేపు మంటలు తింటాయి

కానీ నువ్వుంటావు
నిన్ను మేమనుదినం వింటాము
వింటూనే వుంటాము

కొత్తవాటిని నీ గొంతులో వూహించుకొంటూ
ఆ గొంతును మాలో గొణుక్కొంటూ
దాని అంతు దొరక్క అవులిస్తుంటాము
నిన్ను స్మరిస్తూ నీ మరణాన్ని విస్మరిస్తాము

---

# బోసీ! నా బోసీ!

బోసి! బోసీ! నా బోసీ!
పున్నమి వెన్నెల పుడిసిట దూసీ
కన్నుల గిన్నెల దాచిన బోసీ!

పూల బాలికల
పాల చెక్కిళ్ళు
పురుడు పోసుకొని పుట్టిన బోసి
నవ్వుల రాశి! నా బోసీ!
నా జీవననౌక కళాసీ!
నాకం నుండి
నరలోకానికి
నాకోసం వచ్చిన
నవ్యప్రవాసీ
నా భావాంబరవాసి! నా ఆశల రాశి!

అమానుషత్వం
అరాచకత్వం
ఉంపలమెక్కిన ఈ రోజుల్లో
అమాయకత్వం
అమృతతత్వం
ఆ లోకం నుంచి
మాకు పంచాలని
అంపమైన ని వరహాసంతో
ఆయుర్దాయం పొడిగించని
అరిగి అలిసి అరిపోవు నా
జీవితానికి జీవం పోసుకొని

ఇంకా కొన్నాళ్ళుండాలని
ఎందుకో నాకు దురాశ

కానీ
ఈ కసాయి లోకం
రాకాసి లోకం
రాతిరి పగలు నను
రంపపు కోతలు కోస్తూ
రంగరించి రక్తం పీలుస్తూ
కుంగదీస్తూంది
గోయి తవ్వి సజీవంగా
పాతేయాలని చూస్తుంది

నేనేం చేయగలను తల్లీ
నీకోసం బ్రతకాలని వుంది
ఏమౌతానో తల్లీ
ఒకవేళ వెళ్ళినా
వస్తాను నీకోసం మళ్ళీ!

---

## పునర్జన్మ

తెచ్చుకున్నావు నీతోడ
మంచి చెడుగుల తూచి చూపే
అంతరాత్మను తక్కెడ

పడుచుదనపు వెల్లువందు
పడి కొట్టుకొనిపోవుచూ
పారేశావు దాన్ని మూల
చూసుకొన్నావు సుఖం నీకు
ఎక్కడుంటే అక్కడ

చేవ వుండేదాకనే
చెల్లుతుందీ పోకడ
చేవతగ్గి జీవముడిగి
చేరుతావు కాటికడ
అనుభవాల తనువు రగిలి
మిగులుతుంది బూది మేడ
మోసుకుపోవాలి నీవు
చేసుకున్నది ఒక్కడవ్!

ముజ్జగాల మునసబెదుట
ముద్దాయిగా నిలబడితే
సంజాయిషీ అడుగడు
సమర్థనలను వినడు

సత్యధర్మజ్వాలాద్వయ
సంస్క్రియుడై నరుడు
మచ్చలేని స్వచ్ఛమైన
మానవుడు కావచ్చు మగుడ!

# కవిత కాదు, కన్నీరు!

ప్రసిద్ధప్రజానటుడు, దర్శకుడు అభ్యుదయవాది డాక్టర్ గరికిపాటి రాజారావు ఆత్రేయకు ఆప్తుడు, ఆత్మీయుడు వారిద్దరూ కలిసి ప్రజా నాట్యమండలిలో నాటకాలు ఆడారు ఆ అనుబంధం సినిమా జీవితంలో కూడా కొనసాగింది రాజారావు కన్నుమూసినప్పుడు,ఆవార్త ఆత్రేయ క్షుభితహృదయం అర్పించిన అశ్రుతర్పణ మిది —సం॥

వెళ్ళిపోయావా నా రాజా!
విశ్వమానవతా నందన వీధుల్లో
విరబూచిన తెల్లని రోజా!
చల్లని రోజా! వెళ్ళిపోయావా!

అసూయా అసహనాలతో
అమానుష స్వార్థంతో
అందమైన ఈ లోకం
చిందరవందర అయ్యే కాలంలో
ఇవ్వడమే ఎరిగిన, రాజా!
పుచ్చుకోవడం, రేపటికోసం
దాచుకోవడం తెలియని రాజా!
త్యాగధనంతో మహరాజులను
తలదన్నిన రాజా!

డాక్టరుగా నీ వెందరెందరి,
చెల్లిపోయిన జీవితపు చిట్టాలు
తిరిగి వ్రాసి బతికించావు!
ఎన్ని గుండెలలో తాపాలు హరించావు!
ఎన్ని గుడిసెలలో దీపాలు వెలిగించావు!

నీవు వుంటె, మృత్యువే లేదని,
యముడూ - గిముడూ వట్టి కట్టుకథలని
పెదాసాదా - బీదాబిక్కి ——
పెద్దా చిన్నా - ఎందరెందరు
ఎంత నమ్మకంతో ఉండేవారు!
ఎంత దమ్ముతో బ్రతికేవారు!
అంతా వమ్ముచేసి వెళ్ళిపోయావా?
అంతా కర్మని నమ్మమంటావా?

ని వద్ద నుంచి ఎన్నోసార్లు మేము,
జీవితాలను పొడిగించుకున్నాము!
కాని, ఈనాడు అందరం - ఇందరం
నిన్ను మృత్యువు నుండి ఆపలేకపోయాము!
నిలబడి ఊరక కన్నీరు కార్చాము!
అసహాయులమై ఆక్రందించాము!
అంతకన్న ఏం చేయగలము?
మర్త్యులము, మామూలు మానవులము

డాక్టరుగా సరే - యాక్టరుగా
హిమాలయశిఖరం అంతటి వాడివి నీవు!
ఆంధ్ర నాటక రంగంలో
అతినూతన, అధునాతన
యవనిక లెన్నో ఆవిష్కరించావు!
నవయుగ గళములు పలికించావు!!

ప్రజలకోసం కళ - అనుసత్యం
ప్రతిసారి నిరూపించావు!
మామూలు మట్టిలోంచి
మహానటీనటులను సృష్టించావు
మా నాటకాలలో ఎన్నో పాత్రలకు
రూపం తెచ్చి ప్రాణం పోశావు!

అందుకే నీ నిష్క్రమణ కూడా
అంత నాటకీయంగా చేశావు!

నీ హృదయంలా నీ యిల్లూ విశాలమైంది,
అది ఒక సత్రం అంటారందరు
కాదు, పుష్పకమంటాన్నేను,
ఎందరికైనా అందులో చోటుంది
అందరికీ అందులో అన్నం వుంది
నిర్భాగ్యులకూ నిరుపేదలకూ
నిరాశతో నీరయ్యేవారికి
నందన వనమది - ఆ
నంద నిలయమది

తిండి లేకున్నా - నువ్వండగ ఉంటే -
నీ అభయహస్తం - నీ అమృతహాసం
నిరంతరం నీడ నిస్తుందని
ధీమాగా వుండేవా రెందరు

దీనులు, దినం గడవలేని వారు
దిగ్గజాల్లాంటి కళాకారులు
నివురుగప్పిన నిప్పులు
మట్టిలో మాణిక్యాలు
మన సినిమా లోకం
ఆదరించని ఆర్టిస్టులు
చిన్నచిన్న పెద్దవాళ్ళు
వాళ్ళంత రీనాడు అనాథలు
అమ్మా, నాన్నా లేని పసిపాపలు
ఏం చెయ్యమంటావు వాళ్ళను?

నీ మంచితనానికి
పునాదిరాయి
పునీతమైన నీ సతి

ఇరవైనాలుగ్గంటలూ
ఇంటికి వచ్చిన అందరికీ
వండి వార్చడం తప్ప
వేరే ఎరుగని ఇల్లాలు!
అన్నపూర్ణ! అరుంధతి!
అర్థాంగి కాదు,
ఆమె పూర్ణాంగి నీకు!

కష్టాలనే మృష్టాన్నం చేసి తినిపించి
హరించుకునే శక్తి కల్గించావా సతికి
కనుకనే కళతప్పని నీ కళేబరాన్ని కాంచి
కన్నీరైనా కార్చలేకపోయింది!

నిన్ను తీసుకు వెళ్తుంటే
'ఎందుకు ఏడుస్తారు?
అందరూ పోయేవారే' అన్నది,
అదే నీవామెకు వదిలిన ఆస్తి!

---

# ఆ గది

ఆ గదికీ నా హృదికీ
ఆజన్మాంతర బంధం
ఆ గదిలోనే
ఈ హృది కదిలింది
ఆ మీదట రగిలింది
ఆపై అది పగిలింది
ఆఖరు కా గది మిగిలింది

అందులో గడిపాను
అతిభయంకర నిశలు
అందులో కన్నాను
అందమైన కలలు
అందులో పూడ్చాను
ఎవరందుకోని మమతలు
అందులో వదిలాను
అలసిన ప్రాణాలు

అదే నా పడక గది
అక్కడె నే చచ్చినది
తలగడపై కనపడతాయి
కడపటి కన్నీటి చారలు

తలుపులు జీవుడు మూస్తుంటే
తనువుకు చలువలు వస్తుంటే
కన్నీటికి మాత్రం కడవరకు
మిగిలియుండె నులివెచ్చదనం

నను గూరిచి పరలోకం
అనుకొంటుందొక కథగా

అనుభవించె అనుభవించె
అందాలానందాలని
అంటుంది అసలది కాదు
అది నిజంగా అబద్ధం

ఇదే నిజమైన నిజం
పదహారేళ్ళ ప్రాయంనుంచి
పడ్డదంతా బాధే
గొడ్డుచాకిరి గాదె
అడ్డమైన వాళ్ళందరికీ
అర్జించిన దర్పించాను
తెచ్చిన ప్రతి నయాపైన
వెచ్చని నా నెత్తురులో
అచ్చుపోసి తెచ్చినదే

ఎవరినీ శత్రువుగా
ఈనాటికీ అనుకోలేదు
ఎవరికీ వున్నంతలో
ఏదీ లేదనలేదు
కంచం మంచం ఇచ్చి
పంచలోన చేరిస్తే
వంచన చేసారందరు
పొంచి వెనుక పొడిచి
బుద్ధి చెప్పి పోయారు

నిముషం సుఖపడితే
నెలరోజులు కన్నీళ్ళు
ఒకసారి నవ్వితే
వందసార్లు ఏడుపులు
ఒకడుగు ముందుకు వెళ్తే
మూడడుగులు వెనక్కు లాగి

ఉన్నదంత దోచుకొని
వెళ్ళేది నా దుర్విధి

మరలా మొదలు మరలా ఎదురు
ఈలా తిరిగి తిరిగి
విసిగి విసిగి
అరిగి అరిగి
ఈ నాటికి మృత్యువు ఒడిలో
విశ్రాంతి లభించింది
అనుభవించిన మాట నిజమే
అవి కష్టాలు, నష్టాలు!
మోసాలు ద్రోహాలు!

# వెళ్తున్నాను

నేనిచ్చినదె తక్కువ
నే తీసుకున్న దెక్కువ

ఈ జగతిని నా ఖాతా
ముగించలేదు ఇంకా

ఋణ భారమెంతో తెలిసి
నా ప్రజకొక్క నోటు వ్రాసి
వెళ్తున్నాను నేను నేడు
తిరిగొచ్చి తీర్చుతాను

తెల్లారేలోపుగా నే
వెళ్ళాలి జగతి విడిచి,
వెలుగులో ఈ జగతి చూస్తే
వెళ్ళను నా కాళ్ళాడవు

నే వెళ్లినాక వచ్చి
నా ఇల్లు తెరచి చూచి
వడ్డించని విస్తరాకు
వండనట్టి వంటసరుకు
కనిపించును చూచిపోండి
కన్నీరు విడువకండి
అనిపించేదనకండి

---

## సూక్తులు

మనసన్నది చిన్నగది
అందొక్కరికే తావున్నది —
నేను నువ్వని యిద్దరుంటే సర్దుకోదది
ఇద్దరొకరైనప్పు డెంతో పెద్దదవుతుంది.

'నే' నన్నది ఏకవచనం
'మన' మన్నది బహువచనం
ప్రేమలోన ఏకమైన
మనం మాత్రం ఏకవచనం

జీవితం నిప్పంటించిన సిగరెట్ వంటిది
అనుభవించినా అదమరచినా
అది మాత్రం కాలిపోతుంది
తుదకు బూది మిగులుతుంది

చెడు చేస్తున్న కాలంలోనే
మంచి కూడా చేయగలిగాను
చెడు చెయడం మానుకున్నాను
మంచిచేసే శక్తి కూడా పోగొట్టుకున్నాను

అడుగడుగునా ఆశ ముందుకు
తరుముతుంటే - పరిగెత్తి పరిగెత్తి
అంతకన్నా ముందు నా కోసం
ఎదురుచూస్తున్న నిరాశను
అందుకుంటున్నాను

ప్రభూ! ఈ ప్రపంచాన్ని మార్చు
అది నాతో ప్రారంభించు

చాలామందికి దేవుడు, అంతరాత్మ—ఆటవస్తువులు.
వాటితో నిర్భయంగా ఆడుకుంటారు
అవి లేవని, వున్నా ఏం చెయ్యవని
వాళ్ల గట్టి నమ్మకం

మన అలవాట్లే మన ప్రతిబింబాలు
వాటిని చూచే మనల్ని గౌరవించేది,
ప్రేమించేది,
ద్వేషించేది కూడా

అనుకోని వెన్నియో జరిగిపోయినవి
అనుకున్న వెన్నియో జారిపోయినవి
అందుకే 'రేప'న్న ఆశ మనకు
అదికూడా 'నిన్న'గా మారేవరకు!

పాపం చేసేటప్పుడు వీరుడిలా ధైర్యంగా
పదిమందికి తెలిసేటట్లు చేయి —
పుణ్యం చేసేటప్పుడు పిరికివాడిలా
ఎవ్వరికీ తెలియకుండా చేయి

మానవుడు ఏమాత్రం సహించలేని క్షమించలేని
అన్యాయాలను అవినీతులను
దేవుడు కళ్ళుమూసుకొని సహిస్తాడు —
అదేమిటంటే చేసేవాళ్ల కర్మంటాడు.

దేవుడు వుంటే
ఉన్నాడనే వాళ్లకే కాదు
లేనివాళ్ళకూ వున్నాడు
ఉన్నాడనేవాళ్లకు వాడు ఆటబొమ్మ —
లేడనేవాళ్లకు అంతరాత్మ!

ఉన్నవాళ్ళూ అనుభవిస్తారు
లేనివాళ్ళూ అనుభవిస్తారు
ఒకరు సుఖాలను
వేరొకడు కష్టాలను

సమర్థులైనవా రెప్పుడు
నాయకత్వం వహించి మార్గదర్శకు లౌతారు,
మిగిలినవారు వారిని అనుసరిస్తారు

జీవితంలో అప్పుడప్పుడు
ఎదురయ్యే చిక్కులు
మెదడుకు బలం చేకూర్చే టానిక్కులు

సంగీతం సర్వసామాన్యుల భాష

శివాజీవలె జీవించు
శంభాజీవలె మరణించు

మనిషి విజయానికి ఇదే దారి
అంటూ ఏదీలేదు
కాని స్పష్టమైన, నిర్దుష్టమైన
గమ్యం మాత్రం ఉండాలి
గమ్యమే విజయాన్ని సాధిస్తుంది

ధనంచేత సుగుణం రాదు, కాని
సుగుణంవల్ల ధనంతోపాటు
అన్నీ సమకూరుతాయి

ప్రేమ 'కేన్సరు' వంటిది
అది వచ్చిందంటే చచ్చేదాకా మానదు.

ఆత్మవిశ్వాస మున్నవాడెవడు
అమ్ముడు పోడు

విద్యకంటె ధనం లేదు
అపకీర్తికంటె మరణం లేదు

వివేకవంతుడు స్వానుభవంవల్ల
నేర్చుకుంటాడు
తెలివిగలవాడు, వివేకవంతుల
అనుభవాలవల్ల నేర్చుకుంటాడు

అనుభవం జ్ఞానానికి జనకుడు

ఇప్పుడు మానవుడికి
'దేవుడున్నాడా'? అనే ప్రశ్నలేదు
దేవుడికి 'మానవుడున్నాడా'?
అన్న ప్రశ్న కలిగింది

నేను ప్రపంచంలోకి రాగానే
కొందరు సంతోషించి వుంటారు
ఇక్కడ నుంచి వెళ్ళిపోయేటప్పుడు
కొందరైనా దుఃఖిస్తారేమో!
ఈ రెండూ నాకు తెలియనివి
ఈ రాకపోకల మధ్య
ఎన్ని నవ్వులకు, ఎంత కన్నీటికి
కారకుణ్ణయ్యాను అన్నదే నాకు తెలిసింది
అదే నన్ను ప్రపంచానికి తెలిపేది
అదే జీవితమనేది

దెవుడున్నాడా లేదా?
అది అనాదిగా వుంటున్న ప్రశ్న
అలా అనేవాళ్ళందరు
ఆలోచించమనేది ఒక్కటే!
దేవుడికి నచ్చేవి

దేవుడు మెచ్చేవి
మనం చేస్తున్నామా అని!

భయంవల్ల దేవుడున్నాడని పూజించటం కంటె
నిర్భయంగా దేవుడు లేడనడం ఉత్తమం!

నీవు ఎవరో తెలుసా?
పూర్వజన్మలో నా మనసువు
ఈ జన్మలో నా తపసువు
పై జన్మలో నా సమస్యవు

అబద్ధాలాడడం అలవాటుపడ్డ వాళ్ళు
ఎదుటివాళ్ళు చెప్పే నిజాలను కూడా
అబద్ధాలని అనుమానిస్తారు
అబద్ధా లెరుగని వాళ్ళు ఎదుటివాళ్ళు చెప్పే
అబద్ధాలను గుర్తించలేక నిజాలనే నమ్ముతారు

ఎదటివాళ్ళు నిన్ను Exploit చేస్తున్నారని తెలిసి
అందుకు అవకాశం ఇవ్వడం
అది త్యాగమనుకోవడం అవివేకం
అపాత్రదానం దానమూ కాదు, త్యాగమూ కాదు

నువ్వు సుఖపడు
అందుకు ఇతరులను బాధపెట్టకు

కొన్ని నిజాలకు ఋజువులు దొరకవు
అంతమాత్రాన అవి నిజాలు కాకపోవు
ఋజువులు కోరేవాళ్ళకైనా
అవి నిజాలని తెలుసు

నేను ధనం గొప్పతనం ఒప్పుకోను
నా తుది ఊపిరిదాకా

మనిషిని, మనసునె నమ్ముతాను
మనసులేని ధనం
మట్టికి సరికాదు అంతె!

రోజూ పూజలు చేసే వాళ్ళకు
దెవుడు ఒక ఆటబొమ్మ
వాళ్ళకి ఇష్టం వచ్చిన పువ్వులు పెడతారు
బట్టలు కడతారు, నైవేద్యం పెడతారు
అందుకని వాళ్ళకు భయమూలేదు, భక్తీలేదు
దెవుడు లెడనె నాస్తికులకు
మానవునిమీద, మానవత్వమ్మీద
మానవునిలో పెరిగే దైవత్వమ్మీద
నమ్మకం ఎక్కువ

---

ఆత్రేయ చాలా బద్ధకస్తుడు ఎవరికీ ఉత్తరాలు వ్రాసేవాడు కాడు ఒకవేళ వ్రాసినా, నాలుగు ముక్కలు అలాంటి మనిషి. సుదీర్ఘమైన, సమస్యాత్మకమైన లేఖలు అప్పుడప్పుడూ వ్రాసేవాడంటే, ఆశ్చర్యమే! ఆ లేఖలలో వివిధ విషయాలపై ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలను 'వ్యాఖ్యలు'గా అందిస్తున్నాము ఆయన తన అభిమాన పుత్రిక కుమారి కె బి శ్రీ లక్ష్మికి (హిందూపూర్) వ్రాసిన ఉత్తరాలు ఈ ప్రక్రియలో మాకు ఎక్కువగా ఉపకరించినై పోతే, సున్నితమైన హాస్యానికి ఆత్రేయ పెట్టినపేరని చాలా మందికి తెలియకపోవచ్చు ఆయన ఛలోక్తు లన్నిటినీ శ్రీ పైడిపాల, శ్రీ కె వి రావు సేకరించి, 'ఆంధ్రజ్యోతి', 'విజయచిత్ర' పత్రికలలో ప్రచురించారు వాటినే ఇక్కడ పునర్ముద్రిస్తున్నాం — సం॥

## వ్యాఖ్యలు

### పరమధర్మం

నాకు సకల ధర్మశాస్త్రాల సారం మహాభారతంలో ఒక కంద పద్యంలో కనిపిస్తుంది ఆంధ్రపత్రిక ఎడిటోరియల్ మీద ఆ పద్యం ఇప్పటికీ ముద్రిత మౌతూంటుంది

ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియము తన మనంబున కగు దా
నొరుల కది సేయకునికి
పరాయణము పరదర్మపథముల కెల్లన్

ఎంత చక్కగా నాలుగుముక్కల్లో చెప్పాడు మహానుభావుడు! కాని దాన్ని ఆచరించడం ఎంత కష్టం! అదే ప్రతివ్యక్తి ఆచరించగలిగితే ఈ లోకం ఇంత శోకభూయిష్ఠంగా, స్వార్థపరుల, సంకులసమరాంగణంగా, ఏ పాపమూ ఎరగని ప్రజల నరకంగా తయారయ్యేది కాదు

### అంతర్ముఖుణ్ణి

నన్ను గురించి ఎవరేమనుకుంటున్నా నేను పట్టించుకోను పేపర్లలో నన్ను గురించి ఏం వ్రాస్తారో - ఎవరో చెప్తే తప్ప నాకు తెలియదు దూషణ భూషణలకు క్రుంగిపోయి పొంగిపోయే మనస్తత్వం నాది కాదు నన్ను నేను అంతర్ముఖంగా చూసుకొంటాను అంతే

నెను తాగుతానని ఇప్పుడు కాదు — ఎప్పటి నుంచో — ఇరవై నాలుగు గంటలూ తప్పతాగి పడివుంటానని అపవాదు వున్నది నాతో రోజుల తరబడి కాపురం చేసిన కంపెనీ అసిస్టెంట్లు 'అయ్యో! ఆయన తాగరండి. మేము ఇరవైనాలుగు గంటలు రాత్రిళ్ళు కూడా వెంటే వుంటాం' అని చెప్పినా నమ్మేవాళ్ళు కాదు

## నేను - దేవుడు

నేను దేవుడు లేడనలేదు పోతనలాగే 'కలడో లేడో' అన్నాను దేవుడు వున్నాడనుకున్నా, నాకేమి ఇవ్వాలో, నేనేమి చెయ్యాలో ముందుగానే నిర్ణయించి నన్నీ లోకానికి పంపాడు ఆతకన్నా ఎక్కువగా కొత్తగా ఏం కోరుకున్నా దేవుడైనా ఇవ్వలేడు అందుకని ఇచ్చిన దానితో తృప్తిపడటమో, దాన్ని సద్వినియోగం చేసుకొనడమో నేను చెయవలసిన పని — అనె నిర్ణయానికి వచ్చాను అందుకే అయినదానికీ కానిదానికీ దేవుడిని నేను బాధపెట్టను

దైవం, మతం వ్యక్తిగతమైన అనుభవాలు, అనుభూతులు అందుకే దేవుడొకడే అని చెపుతూనే ఎవరికివారు ఒక మతాన్ని, దేవుణ్ణి సృష్టించుకొన్నారు లేకుంటే యిన్ని మతాలు దేవుళ్ళు వెలిసే అవకాశం లేదు

## నా మతం, నా ఉత్తేజం

నేను మార్క్స్ రచనలు చదవలేదు కమ్యూనిజం అధ్యయనం చేయలేదు నేను చదివిందల్లా Tolstoy - వివేకానందుడు ఆ యిద్దరిలోనూ వివేకానందుడు నన్ను ఎక్కువ ఆకర్షించాడు, ఉత్తేజితుణ్ణి చేశాడు 'దేవుణ్ణి విస్మరించినా ఫర్వాలేదు నీ కళ్ల ఎదుటవున్న నీ సోదరులను, పేదలను, నికృష్ట దరిద్రజీవులను విస్మరించకు' అన్నాడు 'నాకు కావల్సింది సన్యాసులు కారు వీరులు, యోధులు' అన్నాడు ఆ మాటలే నన్ను ప్రభావితుణ్ణి చేశాయి ఈ దరిద్రుల, దౌర్భాగ్యుల తరఫున నిలబడి పోరాడే యోధునిగా నేను బ్రతకాలనిపించింది ఆ పోరులో మరణించినా అందరూ కోరుకునే ముక్తి, మోక్షం, నాకూ లభిస్తుందన్న నమ్మకం ఏర్పడింది ఈ విషయంలో రామానుజుడు కూడా నన్ను వెన్నుతట్టాడు గోపురశిఖరం ఎక్కి ఎవ్వరికీ చెప్పకూడదన్న తిరుమంత్రాన్ని అందరికీ — జాతి కుల మత విచక్షణ లేకుండా — ప్రజలందరికీ వెల్లడి చేసినపుడు ఏమన్నాడు? 'వీళ్ళందరూ మోక్షానికీ, స్వర్గానికీ వెళ్లి, నా ఒక్కడికీ ఈ పాపం చేసినందుకు నరకం ప్రాప్తించినా ఆనందంగా స్వీకరిస్తాను, అనుభవిస్తాను' అన్నాడు నా దృష్టిలో - ఆ నాటి సంఘ పరిస్థితులలో - ఆయన గొప్ప విప్లవకారుడు

ఆ ఉత్తేజంతో, ఉత్సాహంతోనే నేను అర్ధరహితమైన ఆచారాలను, సంకుచిత సంప్రదాయాలను, మూఢనమ్మకాలను తెంచుకొన్నాను నాకు నేను ఒక మతాన్ని ఏర్పరచుకొన్నాను

## సాహిత్యలక్షణం

నా సాహిత్యంలో తప్పులు వుండవచ్చు సందేహాలు రావచ్చు కాని నేను వాటిని సమర్ధించుకోను సమాదానాలు చెప్పలేను ఎందుకంటె మీకు తప్పులైతే నాకూ తప్పులే మీకు సందేహాలైతే నాకూ సందేహాలే నేను మహా కవిని కాను కాళిదాసును కాను కవిత్రయ పాదధూళినీ కాను ఒక రకంగా సందేహాలు కల్గించడమే సాహిత్యానికి ఒక విశిష్ట లక్షణం అను కుంటాను అప్పుడే అది ఆలోచింపచేస్తుంది అనేకానేక వ్యాఖ్యానాలకు అవ కాశం ఏర్పడుతుంది రామాయణం చదువుతుంటే ఎన్ని సందేహాలు! భారతంలో ఎన్ని ప్రశ్నలు?' అలాగని నా సాహిత్యాన్ని వాటితో పోల్చుకోవడం లేదు అది పొగరుబోతుతనం! నెను పోతునూ కాను, పొగరుబోతునూ కాను

## నేను శ్రీ వైష్ణవుణ్ణి

నా దృష్టిలో నేను సద్బ్రాహ్మణ్ణి 'సర్వేజనా స్సుఖినోభవంతు' అని సర్వదా కోరుకునే బ్రాహ్మణ్ణి శ్రీ వైష్ణవమతం నేర్పేది 'భవతి భిక్షాందేహి' అని 'వెళ్ళు ఆ పూటకో, ఆ రోజుకో కావలసినంతే తెచ్చుకో రేపటికి దాచుకోవద్దు' అని దాచుకునే గుణమే అన్ని అనర్థాలకు కారణం. Private property అంటూ వుండరాదు — అని ఆ మతం సిద్ధాంతం నా జీవితమూ ఆ బాటలోనే గడిచింది

## మామూలు మనిషి

ఆత్రేయ అంటే మామూలు మనిషేనని, ఆతనిలోనూ లోపాలు వున్నాయని తెలుసుకోవాలి ఏదో భ్రమలో — ఆత్రేయను ఎక్కడో శిఖరాగ్రాన నిలిపి ఆరాధించకూడదు

## పురాణ గాథల బండారం

నాకు పనే దేవుడు పని చెయటమే దైవారాధన పనిలో ఆత్మవంచన చేసుకోకుండా బ్రతకటమే దైవభక్తి ఒకవేళ దేవుడు వున్నాడనుకున్నా — నాకు ఇవ్వవలసిందేదో, నేను తల్లిగర్భంలో ఉండగానే యిచ్చేశాడు అంతకన్నా ఎక్కువ అడిగినా యిచ్చే శక్తి, అధికారం ఆతనికి లేదు నేను ఎంత మనస్ఫూర్తిగా ప్రయత్నించినా నాకు భక్తి కుదరటం లేదు ఏవో పుస్తకాలు వేదాంత గ్రంథాలు చదివితే మనశ్శాంతి కలుగుతుందని నే ననుకోను మన పురాణాలలో భక్తిచేత మృత్యువును కూడా జయించినట్లు, పతిభక్తితో పాతివ్రత్యంతో పతిని మృత్యువు నుంచి కాపాడినట్లు కథలు వ్రాసారు మన వాళ్ళు కథలు రాయటంలో అఖండులు రామేశ్వరంలో కనిపించే పసుపు కొమ్ముల్లాంటి రాళ్లను సీతమ్మవారు రాసుకొన్న పసుపుకొమ్ములని నమ్మించ గల ఘటికులు ఎక్కడో ఒక రాతిమీద రెండు పాదముద్రలు చెక్కి, వాటిని శ్రీరామ పాదముద్రలని ముద్రవేసి, ఆ స్థలాన్ని ఒక యాత్రాస్థలంగా మార్చ గల మహానుభావులు ఈ ధర్మశాస్త్రాలు వ్రాసినవాళ్ళంతా ఆనాటి రాజుల, మహారాజుల — మంత్రులు, గురువులు, పురోహితులు రాజు ఏం చేసినా ధర్మమని స్థాపించడం వాళ్ల ఉద్యోగం అందులో మహాకవులూ వున్నారు కాళిదాసంతటి మహాకవి ఏం చేశాడు? దుష్యంతుడు అమాయకురాలైన శకుంతలను ద్రోహం చేశాడని గొంతెత్తి ధైర్యంగా చెప్పలేకపోయాడు అలా చెప్పివుంటే కాళిదాసు తల అక్కడికక్కడే నేలవ్రాలేది ఎందుకంటే ఆ నాటకం ఆడేది రాజు కొలువుకూటంలో అందుకు ఒక చిన్న పిట్టకథను సృష్టించి, రాజును సమర్థించాడు అది మహాకావ్యం కావచ్చు కాని దాని వెనకవున్న కవి పిరికితనాన్ని నేను హర్షించలేను

దైవం, మతం వ్యక్తిగతమైన నమ్మకాలుగా నిర్ణయించి, వాటిని సమాజానికీ, ప్రజాజీవితానికి, పరిపాలనా విధానానికి ముడిపెట్టకుండా, అవి వాటిలోకి చొచ్చుకురాకుండా చేస్తేగాని దేశం బాగుపడదు.

నేను మద్రాసు వచ్చినపుడు ఒకటో రెండో వినాయకుడి గుడులుండేవి ఈనాడు ప్రతి వీధికి — చివరకు వీధి మలుపులో Footpath ల మీద — కొన్ని వందల వేలు గుడులు ఏర్పడ్డాయి. వీటిని ఏమంటాం? దేశంలో భక్తి పెరిగిందంటామా? భక్తులు పెరిగారంటామా? కాదు అది ఒక వ్యాపారమైంది.

నేను దేవుడు వున్నాడు, లేడు అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం లేదు — వున్నాడని నమ్మేవాళ్లకు నేను లేడన్నంత మాత్రాన లేకుండా పోడు పోనీ — దేవుడి విషయం దేవుడే చూసుకోనీ — నా కెందుకూ?

మానవుడనే ప్రాణి ఈ భూమండలంలో ప్రభవించకపోతే, 'దేవుడు' అని అనుకునే ప్రాణి ఏది వుండేది? ఆ ఆలోచన ఏ ప్రాణికి వచ్చేది? ఈ ప్రశ్నకు కూడా మనవాళ్ళు చాలా తెలివైన కథలు వ్రాసారు గజేంద్రుడు— శ్రీ — కాళ — హస్తి — కథలు చక్కగా అల్లారు కాని పాము పట్టుకున్న కప్ప అరుపులకు దేవుడు దిగిరాడేం? ఈ ప్రశ్న వేస్తామనే వాటికీ పూర్వజన్మ వృత్తాంతాలు, పురాకృత సుకృత దుష్కృతాలు అంటగట్టారు

## నా సంకల్పాలు

నా సంకల్పాలు నా కంటె బలీయమైనవి అందుకే వాటిముందు నేను ఎన్నోసార్లు ఓడిపోయాను ఇక టైంలేదు త్వరపడక అప్పుడు అనుకున్న పనులు చేసి తీరాలి ఆరోగ్యం నాకు సహకరించకపోయినా జరిగి తీరాలి

## జీవిత రహస్యం

సంతోషంగా హాయిగా వుండాలని అందరికీ వుంటుంది కాని ఎందరుండగలుగుతున్నారు? 'శతమానం భవతి' అని ఎందరో ఆశీర్వదిస్తారు.

ఎన్ని ఫలిస్తాయి? జీవితంలో మనిషికి అర్థం కాని ఊహించలేని రహస్యాలు మూడు జననం — వివాహం — మరణం ఏ సైన్సు ఏ జ్యోతిషశాస్త్రం వీటిని గురించి నిర్ధారణగా నిశ్చయంగా చెప్పలేవు ఒకవేళ చెప్పినా అవి పలించవు ఎక్కడో యెప్పుడో ఒకటి రెండు జరిగినా అవి కేవలం Intutions, లేక కాకతాళీయాలే!

## మతోన్మాదం

ఉగ్రవాదులు ఇప్పుడే కాదు, చరిత్రలో ఎప్పటినుంచో వున్నారు ముఖ్యంగా మతోన్మాదులు మతం వ్యక్తిగతమైనదిగానె వుండాలి అది సామాజిక సహజీవనానికి సాధనం కాదు — ఏనాడూ కాలేదు అన్ని మతాలూ ఒక్కడే దెవుడు అంటూ యెన్ని దేవుళ్లను సృష్టించాయి! మత దాస్యంకన్నా మౌఢ్యం మరొకటి లేదు మతం దాస్యాన్ని, దాసులను, దాసీ జనాన్ని సృష్టిస్తుంది — సమర్థిస్తుంది మతం పేరిట చరిత్రలో యెన్ని మారణహోమాలు, రక్తపాతాలు జరిగినవో లెక్కలేదు ఇది అనాదిగా జరుగు తున్న చరిత్ర!

## కర్మ సిద్ధాంతం

వేదాంతం, వైరాగ్యం ఒంటపడితే చాలా ప్రమాదం వాటి జోలికి పోకుండా వుంటే చాలా మంచిది అవి మనిషిలోని కార్యదీక్షను, గట్టి విశ్వా సాలను దెబ్బతీస్తాయి మనలో వున్న ఉడుకురక్తం మీద చన్నీళ్ళు చల్లి చల్లబరుస్తాయి కర్మసిద్ధాంతం మరీ ప్రమాదకరం ఆ సిద్ధాంతంతోనే అనా దిగా సామాన్య మానవుని నోరు నొక్కేసారు, గొంతు నులిమేశారు ఈనాడూ ఆ సిద్ధాంతమే మన దేశంలో నూటికి తొంభైమందిని బానిసల్లా పశువుల్లా బ్రతుకులు గడిపేటట్లు అణచి పారేస్తుంది జాతిని నిర్వీర్యం చేస్తున్న క్రూర సిద్ధాంతం కర్మసిద్ధాంతం ఏ వేదాంతమూ అక్కర్లేదు — నీ జీవితాన్ని నీ హద్దులలోనె పదుగురికి పనికివచ్చే తీరులో తీర్చిదిద్దుకో నీ నిర్ణయాలు నువ్వే తీసుకో వాటిని నిర్భయంగా ఆచరించు

## మతము - రాజకీయాలు

మానవుడు — నిలకడలేని తన జీవితరహస్యాలను తెలుసుకోటానికి, దానికో అర్థం, పరమార్థం, గమ్యం, లక్ష్యం ఏర్పరుచుకోడానికి ఎన్నో శాస్త్రాలను, వేదాంతాలను, ఎందరో దెవుళ్ళను సృష్టించుకొన్నాడు ఎన్ని మతాలు, ఎన్ని మార్గాలు, ఎన్ని యోగాలు! ఒకదాని నొకటి ఒప్పుకోవు ఒకరి నొకరు ఖండించుకొంటారు తమలో తామే ఏకత్వం సాధించలేని ఈ మహాత్ములు మరేం సాధించగలరు?

శంకరుడు బౌద్ధ దర్శనాల నుంచి చాలా సూత్రాలు అవలంబించాడని, అవి తనవిగా స్థాపించుకొనేందుకు మాయావాదాన్ని సృష్టించాడని అంటారు అందుకే శంకరాచార్యులను 'ప్రచ్ఛన్న బౌద్ధుడు' అంటారట వైష్ణవులు రామానుజ స్తుతి చేస్తూ 'ప్రచ్ఛన్న బౌద్ధ మకరాలయ మంత్రదండా'! అంటారు ఎవరీ ప్రచ్ఛన్న బౌద్ధుడు? శంకరాచార్యుడే! ఈనాడు Politics ప్రజాజీవితంతో ఎలా ఆడుకొంటూందో, ఆ రోజుల్లో మతమూ అలాగే ఆడుకున్నది తమ రాచరికాన్ని పదిలంచేసుకునే ఉద్దేశ్యంతో రాజులూ దానికి మద్దత్తుగా నిలిచారు ఆ రోజుల్లో రాజ్యాలను ఏలింది రాజులకన్నా మతమె. మతం చాలా గొప్ప మత్తుమందు ఆ మత్తుమందుతోనే గాంధీ కొద్దికాలం భారతదేశాన్ని ఒకతాటిమీద నడపగలిగాడు. ఆ తాడు గట్టిదన్న నమ్మకం ఆ రోజుల్లోనే చాలా కొద్దిమందికుండేది మిగిలిన వాళ్ళంతా గుడ్డిగా అనుసరించారు. అందుకే గాందియిజమ్ (గాంధీ మతం) కనీసం పది సంవత్సరాలైనా బ్రతకలేకపోయింది ఇప్పుడు ప్రతి సంవత్సరం తద్దినం పెట్టించుకొంటూంది

## ఇదీ నా దేశం!

ప్రతిమనిషి మంచివాడుగా మంచిగానె బ్రతకాలనుకుంటాడు కాని యీనాటి ఆర్థిక, రాజకీయ, సాంఘికవ్యవస్థలు, అవస్థలు అలా బ్రతకనివ్వవు. 'నీది ఎంత న్యాయమైనా అబద్ధాలు చెప్పందే నువ్వు గెలవలేవు' అంటుంది న్యాయస్థానం, చట్టం 'తప్పుడు లెక్కలు వ్రాయిందే నీ సంపాదన నిలువుకో

లేపు' అంటుంది Income Tax Department 'లంచాలు ఇవ్వందే నీ పని జరగదు' అంటుంది ప్రభుత్వం

దేవుళ్ళ పేరిట దేవాలయాల్లో జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు, మోసాలు ఎన్నో! ఇవన్నీ పాపభీతి వుండేనా! దేశంలో ఒక వైపు పెరిగి పోతున్న కోటీశ్వరులను చూస్తే ఆశ్చర్యం! లక్షాధికారి అంటె ఈనాడు అర్థం లేదు మరొక వైపు కూటికి, గుడ్డకు, కొంపకూ నోచుకోని కోటానుకోట్ల జనం! మురికి కాలవలపక్క, ఇరుకుకొంపలలో, ఎండా వానలతొ సహవాసం చేస్తూ, ధూళిలో పెరుగుతున్న భావిభారత పౌరులను - ఓట్లు వేయడానికి మనుషుల లెక్కల్లోకి ఎక్కబోయే పాపలను చూస్తుంటే ఈ దేశంమీద అసహ్యం! ఇది మా దెశం మా దేశం అని చెప్పుకోడానికి అవమానం!

మొన్న రాజమండ్రి నుంచి మద్రాసుకు సర్కారులో ప్రయాణం చెశాను దారి పొడుగునా చూశాను విలయతాండవం చేస్తున్న దారిద్ర్యాన్ని! ఎంత మానవశక్తి, ఎంత మానవమేధ ఎందుకూ పనికిరాకుండా వృథాజీవితాలు, అర్థంలేని బ్రతుకులు గడుపుతున్నవి! కన్నీరు ఆగలెదు నాకు! ఇదే నా మన వేదభూమి? ఇదే నా పుణ్యభూమి?

పాపాలు చేసిన వాళ్ళు చచ్చాక వాటికి శిక్షలు అనుభవిస్తారని వేదాంతం పూర్వజన్మ సిద్ధాంతాన్ని సృష్టించి ఇదంతా వాళ్ళ కర్మ అనే ఒక్కమాటతొ అందరి నోళ్ళు మూయించారు — ఆనాటి క్షత్రియులు, బ్రాహ్మలు! ఇదంతా దేవుడు రాసిన రాత అని, తమ ప్రాప్తమని నమ్మి పడి వుంటున్నారు అమాయక ప్రజ! ఎక్కడ దెవుడు, ఎక్కడ పాపభీతి? ఏడేడు తరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తులు సంపాయించి పదిలంచేసుకున్న వాళ్ళు చెసిన, చేస్తున్న పాపాలకు ఎప్పుడు శిక్ష అనుభవించెది? ఘోరమైన క్రూరమైన పాపాలు చేస్తున్నవాళ్ళు మన కళ్లెదుట భోగాలతో తులతూగుతున్నారు ఎక్కడ వుంది పాపభీతి?

దైవభక్తి వుండనీ — తప్పు అనను అది నీ వరకే వుండనీ దాన్ని ఈ దురాచారాలను, దుర్మార్గాలను, దోపిడీని సమర్థించేందుకు మాత్రం ఉపయోగించవద్దు ఈ స్థితిని ఎదుర్కొని తీరాలి ఆ స్థితి రావాలంటే మనకున్న దైవ భక్తిని మనవరకే దాచుకోవాలి అవసరమైతే మూలకు నెట్టాలి నిరీశ్వర వాదుల్ని చేయాలని నా ప్రయత్నం కాదు గాంధీ నిరీశ్వరవాదై వుంటే మన దెశ భవిష్యత్తు ఇలా వుండేది కాదు ఆనాడే మారేది

## ఎవరీ 'నేను'?

ఆసలు ఈ 'నెను' అనేదెమిటి? ఈ రూపమా, నామమా, ప్రాణమా, దెహమా, ఆత్మా, మనసా, మేదస్సా — ఏది 'నెను'? ఏదైనా నశిస్తుంది ఈ జన్మలో చెసిన మంచివల్లనొ చెడ్డవల్లనో ఇది పేరుగా కొంత కాలం వుంటుంది. సైన్సు కలిగించిన సౌకర్యంవల్ల మరికొంత కాలం రూపంగా వుంటుంది. తరువాత ఒంతా కాలగర్భంలో కలిసిపోతుంది ఈ 'నేను' మరలా పుడుతుం దనడం, అనుకోవడం అవివేకం అంటే పునర్జన్మ సిద్ధాంతాన్ని నెను అంగీక రించను ఈ జన్మలో చెసిన పాపపుణ్యాలను పైజన్మలొ అనుభవిస్తారంటే అబద్ధం ఒకవైపు ఈ జన్మలో చెసిన మంచికి స్వర్గంలొ సుఖాలు పొందు తావు, చెడుకు నరకంలో శిక్ష అనుభవిస్తావు అని చెపుతూ మళ్ళీ పుట్టుకకు మూట కట్టుకు వస్తావు అనడం అపహాస్యం

అయితే సత్కర్మ ఎందుకు చేయాలి అన్న ప్రశ్న వస్తుంది 'పై జన్మలో అనుభవిస్తావు' అన్న సిద్ధాంతం మీద నిజంగా నమ్మకమే వుంటె ప్రపంచంలో యింత పాపం పెరిగేది కాదు ఎన్నో శతాబ్దాలుగా ఎందరో యెందరో కోటాను కోట్ల ప్రజల శ్రమ, కృషి ఫలితం — మనం ఈనాడు అనుభవిస్తున్నాం. అలాగే యెందరొ దుర్మార్గుల దౌర్జన్యాల దుష్కర్మల పలితం కూడా అనుభ విస్తున్నాం మన తరువాతితరం వాళ్ళు సుఖపడాలి అంటే మనం సత్కర్మ చెయ్యాలి వచ్చే జన్మలో నువ్వు అనుభవిస్తావు అన్న మాటలో ఆ 'నువ్వు' అనేది నువ్వుకాదు రాబోయే తరం వాళ్ళందరిలో నువ్వు వున్నావనుకుంటే, వాళ్ళందరూ నువ్వేననుకుంటే, నీ బాధ్యత ఏమిటో అర్థమవుతుంది

భగవద్గితను గురించి చూడు 'శ్వేతాశ్వతరోపనిషత్' అని ఒక ఉప నిషత్తు వున్నది దాని కర్త దాని పేరు చెప్పుకోలేదు అందులోని భావాలె కాక శ్లొకాలు, రచనా విదానం, మక్కికి మక్కి కాపీకొట్టేసిందే భగవద్గీత అని ఇటీవలే చదివాను భగవద్గీత ఉపనిషత్ సారం కాదు - ఒక ఉపనిషత్ చౌర్యం ఇలాంటి గ్రంథచౌర్యం ఆకాలంనుండీ జరుగుతున్నదంటె ఆశ్చర్యం!

## తమిళుల భాషాభిమానం

సినిమా సాహిత్యంలోనే కాదు, ఈనాడు మన తెలుగు పత్రికల్లో పేజీకి కనీసం పదైనా దుష్టప్రయోగాలు, సమాసాలు వుంటాయి పురాణం సుబ్రహ్మణ్య శర్మలాంటి పండితులు పత్రికా సంపాదకులుగా ఉన్నా, వాళ్ళు వాటిని పట్టించుకోరు ధర్మపోరాటం', 'అగ్నిపూలు' లాంటి పదప్రయోగాలను వాళ్ళు సరిదిద్దరు ఆంధ్రులకు దేశాభిమానం లేదు, భాషాభిమానం అంతకన్నాలేదు అదే తమిళులు సినిమాద్వారా పత్రికలద్వారా భాషను ఎంతో అభివృద్ధి చేసుకొన్నారు ఇక్కడ రిక్షావాడికైనా ప్రొద్దున టిఫిన్ తినడం యెంత ముఖ్యమో, పేపర్ కొని చదవడం కూడా అంత ముఖ్యం వాడు వ్యావహారిక తమిళాన్నే కాదు స్వచ్ఛమైన గ్రాంథిక తమిళాన్ని కూడా అర్థం చేసుకుంటాడు తమిళనాడులో మామూలు మనుషుల్లో నూటికి ఐదుగురైనా వేదికమీదికి పిలిస్తే ఒక్క ఇంగ్లీషుముక్క వాడకుండా అనర్గళంగా ఒక గంటసేపైనా మాట్లాడగలరు ఇంగ్లీషు మాటలన్నిటికీ పర్యాయ పదాలు తమిళంలో సృష్టించుకున్నారు ఉదాహరణకు 'గ్రామఫోన్ రికార్డ్ అనే మాటకు వాళ్ళు 'ఇసైతట్టు' అంటారు తెలుగులో చెప్పవలసివస్తే 'సంగీతపు పళ్ళెం' అని అర్థం మనం తెలుగులో ఆ మాట అంటే నవ్వుతాము వాళ్ళు నవ్వరు అది వాళ్ళ బాష వాళ్ళకు కావల్సింది వాళ్ళ భాష అదీ వాళ్ళకున్న భాషాబిమానం వాళ్ళముందు మనం చేస్తున్న మన బాషా అవమానాన్ని తలుచుకుంటే సిగ్గుతో తల వంచుకోవాలి

## వెల్లువ రావాలి

సినిమా పొగడ్తలు పొగడ్తలు కావు ఇది కేవలం వ్యాపారం కాళిదాసు పాత్ర ధరించినంత మాత్రాన కాళిదాసు గొప్పతనం తెలుస్తుందా? పతివ్రత వేషాలు వేసినంత మాత్రాన పతివ్రత లవుతారా?

"కళాప్రపూర్ణ" బిరుదు ఎందరికి ఎంత తేలిగ్గా ఇచ్చేస్తున్నారు! ఎందరు కొనుక్కుంటున్నారు! ఇవేవీ మనం పట్టించుకోకూడదు, మాట్లాడనూ కూడదు

కోటీశ్వరులెలా అవుతున్నారు? వారు కూనీకోరులైనా వాళ్లకు దండాలు పెడుతున్నారు, దండలు వేస్తున్నారు

సమాజంలో నైతిక విలువలు నానాటికి పడిపోతున్నాయి అలాంటప్పుడు మనం బాధపడి లాభంలేదు ఎదురించగలిగితే ఎదురించాలి ఆదీ వ్యక్తిగతంగా, వ్యష్టిగా జరిగితే — జరిపితే — ప్రయోజనంలేదు ఒక వెల్లువ రావాలి ఇవన్నీ కొట్టుకుపోవాలి

## నా సినిమా సాహిత్యం

నా సినిమా సాహిత్యాన్ని గురించి మరికొన్ని నిజాలు చెప్పాలి నేను రాసినవన్ని మంచివి కావు కొన్ని చెత్తపాటలూ రాశాను కొన్ని బూతులుగా ధ్వనించేవీ రాశాను. సినిమా కవి బ్రతుకు అనేకానేక అభిరుచులు గల విటులను సంతృప్తిపరచవలసిన పడుపువృత్తి ఒక దశాబ్దం పూర్వం అలా వుండేది కాదు అనాడు దర్శకులు, నిర్మాతలు ఉత్తమాభిరుచులు కలవాళ్ళు ఈ దశాబ్దంలోనె సినిమా మరీ అధోగతికి వెళ్లిపోయింది లక్షలు పెట్టి కోట్లు సంపాయించుకోవాలనే పెట్టుబడిదారీ తత్వం నానాటికీ ప్రబలిపోతూంది వాళ్లకు దేశంతో పనిలేదు ఏం చెస్తే ప్రజలు డబ్బు కురిపిస్తారు, అది ఎంత నీచమైనా చేద్దాం, ఉన్నదే వాళ్ల దృష్టి వాళ్ళు చెయడమే కాదు — మాచేత కూడా చేయిస్తారు, వ్రాయిస్తారు నిజంగా, నిష్పక్షపాతంగా సినిమా సాహిత్యాన్ని విమర్శించి నిగ్గుతేల్చే న్యాయస్థానం ఏనాడైనా ఏర్పడితే, అందులో సినిమా రచయిత ఆత్రేయ కూడా నిందితుడిగా, శిక్షార్హుడిగా నిలబడాలి, తప్పదు ఆ పాపపరిహారార్థమే నేను మళ్లీ నాటకాలకు వెళ్లాలని

## రాహుల్ సాంకృత్యాయన్

రాహుల్ సాంకృత్యాయన్ మహాపండితుడు టిబెట్‌లాంటి దేశాలనెన్నింటినో పర్యటించి, అక్కడక్కడ గుప్తంగావున్న తాళపత్ర గ్రంథాలను సాధించి, సంపాదించి, శోధించి వ్రాసాడు ఆయన 'భారతీయ దర్శనం'లో 'ఇంకా యెన్నో తాళపత్ర గ్రంథాలు ఏ స్థూపాలలోనో, విగ్రహాలలోనో గుప్త

పరచబడి వున్నవి. వాటిని సంపాదించలేకపోయాను ఏనాటికైనా అవి బయటపడి చరిత్రమీద కొత్త వెలుగులు ప్రసరింప చేస్తాయి కొత్త సత్యాలు వెలువరిస్తాయి — అని నా ఆశ' అని వ్రాసాడు 'భారతీయ దర్శనం' తెలుగులోకి అనువదించింది ఒక హిందీ పండితుడు ఆయనకు తెలుగు సరిగా రాదు వాక్యనిర్మాణం సరిగా వుండదు దుష్ట సమాసాలు కోకొల్లలుగా వుంటాయి ఇటీవల 'సాహిత్య బాటసారి' అని శారద అనే రచయిత మీద గ్రంథం వ్రాశాడు 'సాహిత్య బాటసారి' అన్న ప్రయోగం ఎంత దుష్టమో ఆయనకు తెలియదు పాపం! ఇటువంటి ప్రయోగాలు భారతీయ దర్శనంలో దర్శనమిస్తుంటాయి వాటివల్ల కలిగే తలనొప్పిని భరిస్తూ ఓపికగా చదవాలి వస్తువును మాత్రమే గ్రహించాలి ఒకటికి రెండుసార్లు చదివితె గానీ అవ గాహన చేసుకోవటం కష్టం

## ఆడపిల్లలు

ఆడపిల్ల అన్న తర్వాత 'ఆడ' పిల్లేనని 'ఈడ' పిల్లకాదని, ఏనాటికైనా పెళ్లిచెసి పరాయి యింటికి పంపక తప్పదని — తరతరాలుగా మన సమాజంలో వున్న సంప్రదాయం, మూఢనమ్మకం ఇదే న్యాయం మగపిల్లల విషయంలో ఎందుకు వర్తించదో అర్థం కాదు దాదాపు ఇరవై ఏళ్ళు తనదైన ఒక వాతావరణంలో పెరిగి, ఉన్నట్లుండి ఒకరోజున ఒక కొత్త వాతావర ణంలో కొత్త మనుషులలో బ్రతకటానికి — పెళ్లి అనే ఒక సాకుతో ఆడ పిల్లను మెడపట్టి గెంటడం, మన న్యాయం, ధర్మం! అందులో సంప్రదాయా లకు, సమాజం కట్టుబాట్లకు కట్టుబడిన సంసారాలలో ఇది తప్పనిసరి!

## ప్రేమజాడ్యం

ఉర్దూ కవితల నుంచి పాశ్చాత్య సాహిత్యం నుంచి మనకి ప్రేమ జ్వరం సంక్రమించింది సినిమాలు ప్రేమ నొక అనివార్యజాడ్యంగా తయారు చేశాయి ధర్మానికీ, కర్తవ్యానికీ కట్టుబడడం మన సంప్రదాయం అన్నిరకాల ప్రేమలూ మనకు వ్యామోహాలే! ధర్మకర్తవ్య నిర్వహణలో వున్నంతవరకు

మనిషి జీవితం క్రమబద్ధంగా, ప్రశాంతంగా వుండేది ప్రేమ - దాన్ని చిందర వందర చెసి - అల్లకల్లోల పరచింది

## నాడు - నేడు

అనాడు భారతజాతికి ఒక లక్ష్యం వుండేది — బానిసత్వపు సంకెళ్ళు పగులవేయాలని! కనుకనె మహాత్ములు — మహావీరులు — మహాకవులు — త్యాగమూర్తులు జన్మించారు ఈనాడు అలాంటి లక్ష్యం ఏదీలేదు — స్వార్థం తప్ప! అందుకె పిరికిపందలు, వంచకులు, సంకుచితస్వభావులు, పెదవుల పైనుంచి ఉపన్యాసాలు వెళ్ళగక్కె వెంగళులు పుడుతున్నారు — గిడు తున్నారు!

## రాబోయే విప్లవం

ఎప్పుడో 1951 లో అనుకుంటాను 'దీక్ష' చిత్రంలో 'మనుష్యులంటే వీళ్లేనా, ప్రపంచమంతా ఇంతేనా?' అని ఒక పాట వ్రాసాను అందులో 'బాధపడి లాభంలేదు, బాగుపడె రాతేలేదు' అన్నాను అది ఈనాటికి అక్షరాలా సత్యం ఈనాడు ఇంకా యింకా అధ్వాన్నమైపోయింది మన స్వాతంత్ర్యం ఇది యింకా అదోగతిపాలవుతుంది ఈ రక్తపాతాలు, ఈ హింసాకాండ చూచి ఇప్పుడె ఇంత ఆందోళన పడితే ఏం లాభం? ముందు ముందు రాబొతూంది ఒక భయంకర రక్తపాతంతో కూడుకున్న మహావిప్లవం అది అనివార్యం ఇప్పుడు మన దెశనాయకులు చేస్తున్నదంతా — ఆ మహా విప్లవం రావడానికి కావలసిన బీజాలు వాళ్ళకే తెలియకుండా నాటు తున్నారు అమాయక ప్రజలను పెద్దపెద్ద నినాదాలతో చిన్నచిన్న దానాలతొ మభ్యపెట్టి తమ స్వార్థానికి ఉపయోగించుకోవచ్చని తమ దారికి అడ్డం రాకుండా ఆపవచ్చని, భ్రమపడుతున్నారు మేధావివర్గం పెరగకూడదని, పెరిగినా వాళ్ళకు అంత కవళం వేస నోరు మూయించాలని అన్ని విధాలా ప్రయత్నిస్తున్నారు ఇది ఎంతోకాలం సాగదు అందరినీ అంతకాలం మోసం చేయులేరు ఈ విప్లవం నా తరంలో రాకపోవచ్చు మీ తరంలోనైనా మీరు

చూస్తారు సూర్యోదయం కాకుండా వెలుగురాదు విప్లవం రాకుండా అభ్యు దయం కలుగుతుందనుకోవడం చాలా భ్రమ రక్తపాతమంటారా? సూర్యుడు ఉదయించేటపుడు రక్తపుముద్దలా వుంటాడు పసిబిడ్డ తల్లిగర్భం నుంచి బయటపడేటప్పుడు రక్తసిక్తంగా వుంటుంది అందుకు భయపడకూడదు. చరిత్ర చూస్తే రక్తసిక్తం కాని జానెడు స్థలం ఉందా ఈ భూమండలంలో? లేదు

భయపడకండి భయపడకండి వీలైతే ఆ విప్లవ రథచక్రాలను కది లించేందుకు మీ శాయశక్తులా ప్రయత్నించండి మీరూ ఒకచేయి వేయండి 'నేను సైతం విప్లవాగ్నికి సమిధ నొక్కటి అందించాను' అని గర్వపడవచ్చు.

## నా ధ్యేయం

నేను సత్సంప్రదాయ వంశంలోనే పుట్టి పెరిగాను కాని కొంత కాలా నికి నాలో ఏ మూలనో దాగివున్న విప్లవకారుడు తలెత్తాడు దనికుల దౌర్జన్యా లను, పెట్టుబడిదారుల దోపిడీవిధానాన్ని, రాజకీయాల రొచ్చును, అమాయక ప్రజల కన్నీళ్ళను కడగండ్లను కళ్ళారా చూచి విజృంభించాడు ఆ విప్లవ కారుడు. ఈ అత్యాచారాలను, అన్యాయాలను దైవానికీ ఖర్మకూ అంటగట్ట డానికి నా మనసు అంగీకరించలేదు 'ఈ కుళ్ళును కడగలేకపోయినా, బయటపెట్టాలి కళ్ళుండీ నిజాన్ని చూడలేక గుడ్డివాళ్ళుగా బతుకుతున్న ఈ ప్రజల కళ్ళు తెరిపించాలి ఎలా? ఎలా?' అని మదనపడ్డాను, తపన పడ్డాను, తపించాను, తపస్సు చేశాను ఆ తపస్సు నుంచి వెలువడ్డవే నా నాటకాలు కాని నేనింకా కృతకృత్యుణ్ణి కాలేదు నా ఆఖరి నాటకం వ్రాయాలి నేనే స్వయంగా వెళ్లి ప్రజలలో — దేశం నాలుగు మూలలా — ప్రదర్శించాలి ప్రజలమధ్యనో, రంగస్థలం మీదనో నా ఆఖరి ఊపిరి వదలాలి లేదా ప్రభుత్వ కారాగారంలో క్రుగ్గి మరణించాలి లేదా Law and order రక్షించడానికి కంకణం కట్టుకున్న పోలీసుల తుపాకీ గుండ్లకు బలైపోయాలి. అదే నా లక్ష్యం - నా ధ్యేయం - అప్పుడే నా జన్మ ధన్యం!

---

## ఛలోక్తులు

విశ్వశాంతి నాటకం రాయడానికి నాలుగేళ్ళు పట్టిందన్న ఆత్రేయను ఓ సాహిత్యాభిమాని — 'అదేమిటండీ, ఇప్పుడందరూ నాలుగు రోజుల్లో నాటకం రాసేస్తుంటే?' అన్నారు

'నా కంత తెలివితేటలు లేవండి' అని చమత్కరించారు ఆత్రేయ

* * *

మొదటిసారి హార్ట్ ఎటాక్ వచ్చినపుడు ఆత్రేయ తనను పరామర్శించ టానికి వచ్చినవాళ్లతో ఇలా అన్నారు —

'ఆత్రేయ వేళకు స్క్రిప్టు ఇవ్వరు అతనికి హృదయం లేదు — అనె నిర్మాతలు ఆత్రేయకి హార్టు వుందని ఇప్పుడైనా తెలుసుకుంటారు'

* * *

టైమ్‌కి స్క్రిప్టు ఇవ్వరు అని తనమీద వున్న అపవాదుకి ఆత్రేయ చమత్కారంతో కూడిన జవాబు —

'టైమ్‌కి ఇచ్చేస్తాను కాని ఆ టైమ్ ఎప్పుడొస్తుందో చెప్పలేను'

* * *

చక్రవర్తి సంగీత దర్శకత్వంలో ఆత్రేయ పాట రాస్తూ పల్లవి పూర్తి చేశారు

"అనుపల్లవి చెప్పండి" అన్నారు చక్రవర్తి ఇచ్చింది ట్యూన్ చెయ్యకుండా

"ముందు నువ్వు పల్లవి అను — నేను అనుపల్లవి అంటాను" అన్నారు ఆత్రేయ

అనుపల్లవి కూడా అయింది "ఇంక చరణాలు" అన్నారు చక్రవర్తి

"అదే ఎవరి చరణాలు పట్టుకోవాలా అని ఆలోచిస్తున్నాను" అన్నారు ఆత్రేయ

* * *

ఎర్రమల్లెలు పేరుతో ఒక నాటకాన్ని ప్రారంభించి కొనసాగక రచయిత గణేష్‌పాత్రోను పూర్తిచెయ్యమన్నారట ఆత్రేయ కాని, అది అయనవల్ల కూడా కాకపోతే — 'మనం నాటకాన్ని ప్రేమించాం సినిమాని పెళ్ళాడాం మన బ్రతుకులు యింతే నాటకాన్ని మరవలేము, సినిమాని విడవలేము' అన్నారట ఆత్రేయ ప్రవృత్తికి, వృత్తికి వున్న తేడాను ప్రేమ, పెళ్లితో పోలుస్తూ

* * *

ఓ నిర్మాతకథ మీద ఆత్రేయకు పట్టుదొరకక ఎప్పటికీ డైలాగులు రాయడం ప్రారంభించలేదు తిరిగి తిరిగి విసిగిపోయిన నిర్మాత —

'నా ఫైలు నా మొహాన్న పడేయండి — ఇంకొకడిచేత రాయించు కొంటాను కవులకు కరువులేదు' అన్నాడు

'అలాగే వేరే ప్రొడ్యూసర్లవి రెండున్నాయి అవి కూడా విసుకెళ్లి రాయించు' అన్నారు ఆ నిర్మాత కోపం పోయేలా నవ్విస్తూ ఆత్రేయ

* * *

ఆత్రేయగారివద్ద లేఖకుడుగా పనిచెసిన వ్యక్తి దర్శకుడైన తరవాత తన చిత్రంలో చివరిసీను రాసి వుంచమని, ఉదయం వచ్చి తీసుకెళ్తానని చెప్పి వెళ్ళాడు ఆ రాత్రి ఆత్రేయ ఆ సీను కె వి రావుకు డిక్టేట్ చెసి సాపు కూడా రాయించి సిద్ధంగా వుంచారు

ఉదయాన్నే దర్శకుడు రాలేదు కారు డ్రైవర్ వచ్చి స్క్రిప్టు తీసు కెళ్లాడు

ఓ గంట తర్వాత డైరెక్టర్‌గారి దగ్గర్నుంచి ఆత్రేయగారికి ఫోన్ —

"అడ్డమైనవాళ్ళచేతా సీను రాయిస్తే ఆ మాత్రం గుర్తుపట్టలేనను కున్నారా? ఆ మాత్రం నేనూ రాసుకోగల్ను" దర్శకుడు ఫోన్‌లో అరుస్తు న్నాడు

"అంతకన్న బాగా కూడా రాయగలవు ని వస్తూరి అతని వస్తూరీకన్న బాగుంటుంది" అన్నారు ఆత్రేయ

* * *

రాత్రులు తను డిక్టేట్ చెసిన దృశ్యాన్ని సహాయకులు ఫెయిర్‌చేసి ఆత్రేయ టేబుల్‌మీద వుంచితె అయన తీరుబడి చిక్కిన తరువాత దాన్ని శ్రద్ధగా చదివేవారు

'మీరు రాసింది మీరె చదువుకొంటున్నారే' అని ఎవరైనా అడిగితే —
'అసిస్టెంట్లు నిద్రకళ్ళని రాస్తుంటారు కదా పాపం 'నిద్రారాక్షసాలు' ఏవైనా వున్నాయేమోనని చూస్తున్నాను' అనేవారు ఆత్రేయ అక్షర దోషాలను గురించి చమత్కరిస్తూ

* * *

'ఆత్రేయకు చత్వారం వచ్చినా కళ్ళజోడు వాడేవారు కాదు అతి చిన్న అక్షరాల్ని కాని, రాత్రులు చదవవలసి వచ్చినపుడు కాని భూతద్దంలో చూస్తూ చదివేవారు
'ఏమిటి భూతద్దంలో చూస్తున్నారు ' అని ఓ నిర్మాత అడిగితే—
'నా రచనల్లో బూతు వుందంటారుగా - వెదుకుతున్నా' అన్నారు ఆత్రేయ

* * *

"బ్యాంకులు డబ్బు దోచుకుందుగ్గాని — దాచుకుందుక్కాదు" అనె ఆత్రేయ వున్నట్టుండి ఎకౌంట్ ఒపెన్ చేసి రూ 1500-లు దాచారు
"ఎందుకండీ?" అని శ్రీ కె వి రావు అడిగితె —
"రేపు నె పోయాననుకో - ఉత్తరక్రియలకి వుంటుంది" అన్నారు

* * *

ఆత్రేయ రాసిన డైలాగును అయనె కాపీ చేసుకోవలసివస్తే తెల్ల కాగితం కింద రూళ్ళకాగితం పెట్టి రాసేవారు
"ఇంత శ్రమ ఎందుకండీ మీ దస్తూరి ముత్యాలకోవలా వుంటుందిగా?" అని ఎవరైనా అడిగితే —
"నెను రూలుప్రకారం రాసే మనిషిని" అనేవారు ఆత్రేయ

* * *

ఆత్రేయ ప్రయాణం చెస్తున్న కారు డ్రైవర్ చప్పుడు రావడం గమనించి — 'డోరు పడిందో లేదో చూడండి' అన్నాడు
"డోరు ఎప్పుడూ పడదు బాబూ — డోరు వేయకపోతే మనుషులే పడతారు' అన్నారు ఆత్రేయ

* * *

ఒక ప్రముఖ నటుడు చిత్రనిర్మాణం తలపెట్టి ఆత్రేయగారిచేత పాటలు రాయించాలనుకున్నాడు ఆయన యింటి దగ్గరయితే బద్ధకిస్తారని మద్రాసులోని హోటల్ 'చోళ'లో వుంచారు వారం రోజుల తర్వాత ఆశగా వచ్చిన నిర్మాత హోటల్ బిల్ పెరగడం తప్ప ఆత్రేయగారి కలం ఏమాత్రం నడవకపోవడం గమనించారు కనీసం ఒక 'పల్లవి' కూడా రాయలేదేమని ఆత్రేయగార్ని అడిగాను

"చోళలోకి పల్లవులు రావటం ఎలా సాధ్యం? చోళులు, పల్లవులు శత్రువులు కదా?" అన్నారాయన చిద్విలాసంగా — నిర్మాత ఏడవలేక నవ్వు తుంటే

* * *

అమలాపురంలో ఏర్పాటు చేసిన ఓ సమావేశంలో 'మీరు పాటలు రాసే చిట్కా మా క్కూడా చెపుతారా?' అని అడిగాడో బాంక్ ఉద్యోగి —

'నే నెప్పుడూ పాటలు రాయను' అన్నారు సీరియస్‌గా ఆత్రేయ

ఆ ఉద్యోగి తెల్లమొహం వేస్తే—

'డిక్టేట్ చెయ్యడమే తప్ప రాయడం అలవాటు లేదు' అంటూ కొస మెరుపు ఇచ్చారు ఆత్రేయ

* * *

భామాకలాపం అనే చిత్రంలో ఆత్రేయ చికిత్స కోసం హాస్పటల్‌కి వెళ్లే ఔట్‌పేషంట్ పాత్రను ధరించారు వచ్చిన పేషెంటు ఆత్రేయ అని తెలిసిన నర్సు 'సిరంజిమీద ఓ పాట రాయండి' అని అడుగుతుంది — దానికి ఆత్రేయ 'నే నెప్పుడు సిరంజిమీద రాయను, తెల్లకాగితంమీదే రాస్తాను' అంటారు

* * *

'మీ ఆలోచనల్ని యెప్పటికప్పుడు రాసి వుంచుకుంటారా?' అని అభిమానులు ఆత్రేయను అడిగితే —

'నా ఆలోచనలు రాతల్లో కాదు - తల్లోనె వుంటాయి' అని ఆయన సమాధానం

* * *

వాగ్దానం గురించి ఆయన చాలా సందర్భాల్లో చెప్పేవారు —

'నేను వాగ్దానం మాత్రం చెయ్యను — వాక్కుల నమ్ముకొని బతికే వాణ్ణి వాటిని దానం చేసేస్తే నా దగ్గర ఏమి మిగులుతుంది?' అని

ఆయన వాగ్దానం సినిమా తీసి చేతులు కాల్చుకోవడం అందరికీ తెలిసిందే

* * *

ఆరుద్రగారి షష్టిపూర్తి సభలో ప్రసంగిస్తూ — 'ఆరుద్ర పండితుడు' నేను తలపండితుణ్ణి' అన్నారు ఆత్రేయ

చమక్కు అందని కొందరు పెదవి విరిచారు

ఆత్రేయ తల పండడంలో శ్లేష — ఒకటి తల నెరవడం రెండోది ఉపరితల మాత్ర పాండిత్యం కలవాడిననే వినయం

* * *

ఒకసారి శ్రీ మోదుకూరి జాన్సన్ ఆత్రేయను కలిసి పిచ్చాపాటీ మాట్లాడుతూ—

'నేనూ మీ అడుగుజాడలలోనే నడుస్తున్నాను నిర్మాత ముందుగా డబ్బిస్తే గాని రాయడంలేదు గురువుగారూ' అన్నారట

'పిచ్చివాడా, నేను డబ్బిచ్చినా రాయడం లేదు ఆ సంగతి నీకు తెలియదేమో పాపం' అన్నారట ఆత్రేయ నవ్వుతూ

* * *

వయస్సు పైబడ్డానికి ఒప్పుకోని మనసుకవి కొంతకాలం క్రితం తల నల్లగా కనిపించడానికి ఆయుర్వేదానికి చెందిన ఒక తలనూనె వాడేవారట. తల పండని ఆత్రేయను చూసి వేటూరి సుందరరామ్మూర్తిగారు ఆ తలలోని రహస్యం ఏదో తనక్కూడా చెప్పమన్నారట కొంతకాలం అయింతరువాత నిగనిగలాడుతున్న నల్లని జుట్టుతో వచ్చిన సుందరరామ్మూర్తిగారికి తల పండిన ఆత్రేయగారు కనిపిస్తే 'ఈమధ్య మీరు ఆ తలనూనె రాయడం లేనట్టుందే' అని అడిగారట దానికి బదులుగా ఆత్రేయగారు 'అవును — నువ్వు రాయడం మొదలుపెట్టిం తరువాత నేను రాయడం మానేశాను అన్నారట ధ్వనిగర్భితంగా

* * *

ఒకసారి ఆత్రేయ మాటల సందర్భంలో 'విశ్వమంటె ఏమిటి'' అని శ్రీ పైడిపాలను అడిగారు అంత చిన్నపదానికి ఆయన అర్థం అడగడంలోని ఆంతర్యం ఏమిటో అర్థంకాని శ్రీ పైడిపాలతో —

'విశ్వమంటే ఆంధ్రప్రదేశ్ అని కూడా అర్థం వుంది తెలుసా మీకు?' అన్నారు ఆత్రేయ

'అదెక్కడుంది' అన్న శ్రీ పైడిపాలతో

'ఆ అర్థం వున్నట్టు నాకూ యీ మధ్యే తెలిసింది — తెలుగు నట సార్వభౌములు 'విశ్వవిఖ్యాత' విశేషణం తగిలించుకొన్న తరువాత' అన్నారు ముసిముసి నవ్వులు రువ్వుతూ ఆత్రేయ.

* * *

శ్రీ జగ్గయ్య అనువదించిన రవీంద్రగీత చదివి — ఆయనకు భాష మీద మంచి అధికారం వుంది — ఆయన ప్రౌఢకవి అన్న పైడిపాలతో

'అవునవును జగ్గయ్య మనకు Proud (గర్వకారణమైన) కవి' అని ఆత్రేయ ఆంగ్లపదంతో చమత్కరించారు.

* * *

'మీలా బిరుదుల వ్యామోహం లేనివాళ్ళు ఈ కాలంలో అరుదు' అన్న ఒక పరిశోధకునితో ఆత్రేయ —

'నా బరువును నేనె మోసుకోలేకపోతున్నాను బిరుదుల బరువు ఇంకెలా మోస్తాను' అని తన స్థూలకాయంమీద తనే ఛలోక్తి వేసుకొన్నారు

* * *

సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు డాక్టరేటు ప్రదానం చేసిన సంద ర్భంగా మద్రాసులో జరిగినసన్మాన సభలో ప్రసంగిస్తూ ఆత్రేయ —

'అవును పెద్దవాణ్ణయ్యాను నాకు డాక్టర్ అవసరం చాలా వుంది అందుకని యూనివర్శిటీవారు నన్నే ఏకంగా డాక్టర్ని చేసేశారు' అన్నారు ఛలోక్తిగా —

* * *

ఆత్రేయచేత మాటలూ పాటలూ రాయించుకోడానికి పడిగాపులు పడి విసుక్కునేవాళ్ళతో ఆత్రేయ తరచూ చెప్పే సమాధానం —

'నేను టింకర్‌ని కాదు థింకర్‌ని'

* * *

ఒకసారి ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రానికి స్క్రిప్టు పూర్తిచేసి ఆఫీసుకి తీసుకొని వెళ్ళారు ఆత్రేయ స్క్రిప్టు టేబుల్‌మీద పెట్టి యెవరో పలకరిస్తే — సమాధానం చెపుతున్నారట ఆత్రేయ

ఈలోగా ఫాన్‌గాలికి కాగితాలు రెపరెపలాడుతుంటె మేనెజర్ కంగారు పడి 'కాగితాలు ఎగిరిపోయెలా వున్నాయి — పెపర్‌వెయిట్ పెట్టు'మని బాయ్‌కి పురమాయిస్తుంటె —

'అవసరం లేదు ఆత్రేయ బరువైన డైలాగులు రాశాడు, అవి అంత తేలిగ్గా యెగిరిపోవు' అన్నారట ఆత్రేయ

* * *

ఆత్రేయ తన ఆరోగ్యం గురించి పరామర్శించడాని కొచ్చిన ఆప్తులతో తరచూ ఒక చలోక్తి చెపుతుండేవారు "డాక్టర్లు నా వెయిట్ తగ్గాలంటున్నారు ఆత్రేయ వెయిట్ అంత తొందరగా తగ్గుతుందా?" అని

* * *

మూగమనసులు, తేనెమనసులు, కన్నెమనసులు, పాలమనసులు, మంచిమనసులు, కలసిన మనసులు మొదలైన చిత్రాలకు రచన చేసిన ఆత్రేయ —

'నేను హార్ట్ స్పెషలిస్టును' అని చమత్కరించెవారు

* * *

ఆత్రేయ మరణించడానికి అయిదారేళ్ళ ముందుగా ఆసుపత్రిలో చెరిన ఆయనకు డాక్టర్ వైద్యపరీక్షలన్నీ చేసిన తరవాత 'మీకు హార్ట్ ఎన్‌లార్జ్ అయ్యింది జాగ్రత్తగా వుండాలి' అని చెప్పారట

దానికి ఆత్రేయ — 'ఓస్ కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు యిన్ని పరీక్షలు చేసి ఇదా మీరు కనుక్కున్న సత్యం ఇది చెప్పడానికి యిన్ని పరీక్షలెందుకు? యింత ఫీజెందుకు? నా హృదయం విశాలమైందని అందరికీ తెలుసు' అన్నారట

* * *

'మీకు నచ్చిన నాటకం ఏమిటి' అన్న పరిశో[redacted] ఆత్రేయ సమాధానం —

'నచ్చని నాటకమేదీ రాయలేదు బాగా నచ్చింది మాత్రం ఇంకా రాయలేదు'

* * *

ఒకసారి ఆత్రేయ రికార్డింగ్ థియేటర్‌కు వెళ్లినప్పుడు శ్రీ బాలసుబ్రహ్మణ్యం కాకుండా మరో నూతన గాయకుడు తన పాట పాడుతుండడం విన్నారు

'ఎవరీ గాయకుడు?' అన్నారట ఆత్రేయ సహజ సిద్ధమైన ధ్వని స్ఫురించేలా

అక్కడున్నవాళ్ళు గాయకుని పేరు చెప్పారు వెంటనే ఆత్రేయ —

'ఏంలేదు బాలు ఫీలవుతూ పాడతాడు ఇతను పాడ్డానికే ఫీలవుతున్నాడు' అన్నారట

* * *

సినిమాల్లో కనిపించె పాటలతోపాటు — ప్రేక్షకులకు వినిపించని పాటలెన్నో తెరమరుగవుతుంటాయి పెద్ద రచయితలచేత కూడా తిరిగి తిరిగి రాయించుకోవడం దర్శకులకు పరిపాటి ఒకసారి రాసిన పాటకు మరో వెర్షన్ రాయమంటూ ఓ దర్శకుడు —

'ఈ పాట నాకే అర్థం కావడంలేదు జనానికేం అర్థమవుతుంది?' అన్నారట వెంటనె ఆత్రేయ 'జనం నీ అంత తెలివితక్కువ వాళ్ళు కాదుగా' అన్నారట

* * *

ఆత్రేయ **1988** లో 'పిల్లలతో చెలగాటం - పెద్దలకే ఇరకాటం' అనే టెలీ సీరియల్‌కు దర్శకత్వం వహించారు దాన్ని సమీక్షిస్తూ ఓ విమర్శకుడు — 'ఇది పాతచింతకాయ పచ్చడిలా వుంది' అని రాశాడు. ఆత్రేయ అందుకు కోపించకుండా చిరునవ్వుతో ఇలా వ్యాఖ్యానించారు —

'పాతచింతకాయ పచ్చడి పథ్యానికి మంచిదని ఆ సమీక్షకునికి తెలియదేమో పాపం'

* * *

ఆత్రేయ నాటకాలు - పూర్వాపరాలు అనే అంశం మీద పరిశోధన చెసిన శ్రీ పైడిపాల **17-5-83** న ఆత్రేయను ఇంటర్వ్యూ చేస్తూ —

'నా ప్రశ్నలతో మిమ్మల్ని బాదపెడుతున్నానా?' అని అడిగారు
'మీరు బాధపెట్టడంలేదుగాని నేను బాదపడుతున్నాను' అన్నారు ఆత్రేయ

ఆయన వ్యాఖ్య అర్థం కాని పరిశోదకునితో —
'మీరు నా రచనల గురించి ఇంత బాదపడ్డం చూసి మిమ్మల్ని బాద పెడుతున్నానని బాధపడుతున్నాను' అన్నారు ఆత్రేయ

* * *

'ఆత్రేయ నాటకాలు - పూర్వాపరాలు' సిద్ధాంత వ్యాసానికి ఆత్రేయ రెండె రెండు ముక్కలు ముందు మాటగా రాశారు —
'ఆత్రేయ నాటకాల మీద పరిశోదన చేసి మిరు డిగ్రీ పొందుదామను కున్నారు. కాని మీ పరిశోధన వల్ల నాకు డిగ్రీ లభించింది' అని

* * *

ఆత్రేయకు ఎదుటి వాళ్ళను 'బూంరాంగింగ్' చేయడమంటే సరదా
ఒకసారి ఆత్రేయకు ఆత్మీయుడైన రచయిత మహారధి తనకు అన్ని ప్రక్రియల్లోనూ సమర్థత వుందనే భావం స్ఫురించెలా 'నెను ఆల్‌రౌండర్ని' అన్నారట
దానికి ప్రతిగా ఆత్రేయ 'అవున్నా నువ్వు ఆల్ రౌండర్‌వి (అన్నిటిలో సున్నావి) అని చమత్కారంగా బాణాన్ని సంధించారట

* * *

ఆత్రేయ నెలరోజులకు చనిపోతారనగా చిరకాల మిత్రుడైన ఒక నటుణ్ణి కలిసి మాట్లాడుతూ సిగరెట్ అడిగారు ఆయన సిగరెట్ మానేశా నన్నారు
'మరి మందు' అన్నారు ఆత్రేయ
'మందుకూడా మానెశాను' అన్నారాయన
'ఇప్పటివరకు మందుభాగ్యుడవనుకొన్నాను మందభాగ్యుడవెపోయా వన్నమాట' అన్నారు నవ్వుతూ ఆత్రేయ

* * *

ఒకసారి ఒ శ్రీమంతుడి యింట్లొ భారీఎత్తున జరిగిన వివాహానికి ఆత్రేయ హాజరు కాలేదు

మర్యాదకోసం మరునాడు వెళ్లి 'నేను నిన్న రాలేదు శుభాకాంక్షలు చెప్పి వెళ్దామని' అంటుండగా — 'అలాగా, అంతా హడావిడి కదా నేను చూడలేదులెండి' అన్నారట ఆ శ్రీమంతుడు

'మీరు చూడరనే రాలేదు' అని నవ్వుతూ బదులిచ్చారట ఆత్రేయ

*   *   *

కొంతమందికి తెలుగు పదాలకు ఇంగ్లీషు సంప్రదాయాన్ని జోడించి ఉచ్చరించడం సరదా అదుర్స్, చమక్స్ మొదలైన పదాలు అలాంటివి

ఒక నిర్మాత ఆత్రేయతో — 'అవునండీ మీరేమన్నా చెల్లుతుంది మీరు కవ్స్ (కవులు) మరి' అన్నాడట

ఆత్రేయ వెంటనే 'అందుకె పాలిస్తున్నాం' అన్నారట గర్వంగా

పాలివ్వడం అనే పదంలో క్షీరాన్ని యిస్తున్నామనె అర్థంతోపాటు మిమ్మల్ని పరిపాలిస్తున్నాం అనె అర్థం కూడా గమనార్హం

*   *   *

ఒక నిర్మాత ఆత్రేయగారికి ఫోన్‌చేసి 'సినిమా పూర్తయింది ఇంకా అమ్మలేదు' అన్నారట ఆత్రేయ పక్కనున్న అసిస్టెంట్ జి రామారావుతో— 'అందుకేనయ్యా వీళ్లను నిర్ మాతలన్నారు' అన్నారాత్రేయ!

*   *   *

ఆత్రెయ తన అభిమాన పుత్రిక శ్రీలక్ష్మి యింట్లొ భొజనం చేస్తుండగా కారం యెక్కువయ్యిందా అండీ' అని ఆ అమ్మాయి అడిగితె —

'నేను ఉపకారం తప్ప కారం గురించి పట్టించుకోనమ్మా' అన్నారట.

*   *   *

శ్రీలక్ష్మి అన పుట్టినరొజున ఆత్రేయ వాత్సల్యంతొ నాగార్జునసాగర్‌లోని తన ఇంటికి వచ్చినందుకు పొంగిపోయింది

'నా పుట్టినరోజున గుడికి వెళ్లటం అలవాటు ఈ రోజు దేవుడే నా కోసం దిగివస్తె యిక వెళ్లడం యెందుకు?' అందట ఆనందాతిరేకంతో ఆ అమ్మాయి

'ఏమ్మా నె నంత రాయిలా అనిపిస్తున్నానా' అన్నారట దరహాసంతో ఆత్రేయ

*   *   *

ఆత్రేయ ప్రాక్టికల్ జోక్స్ వెయ్యడంలో కూడా ఘనాపాఠియే శ్రీలక్ష్మి పుట్టినరోజున ఆత్రేయ పీటమీద (డైనింగ్ టెబుల్ లేని కారణంగా) కంచం పెట్టుకొని అన్నం తింటూ 'అయినవాళ్ళకు అకుల్లో, కానివాళ్ళకు కంచాల్లో పెట్టారు' అంటూ చమత్కరించారు

* * *

ఆత్రెయ, కణ్ణదాసన్ ఆత్మీయులు కణ్ణదాసన్ బావాల్ని ఆత్రేయ తెలుగుచేసి తమిళంలో వాడుకొన్న సందర్భాలు కూడా వున్నాయి అలాంటి స్నేహంలొ ఒకరొజు ఆత్రెయ కణ్ణదాసన్‌గార్ని కలిసి — 'నల్లా ఇరికింగ్లా' (బాగా వున్నారా?) అని తమిళంలో కుశలప్రశ్న వేశారు దానికి కణ్ణదాసన్ 'నల్లా ఆడిచిడింగొ ఇరికేన్ ('బాగా' — కొట్టేయండి, వున్నాను)' అన్నారు చిరుదరహాసంతో ఆంతటితో వూరుకోక తనను తమిళంలో కుశలమడిగిన ఆత్రేయను తెలుగులో 'మీరు కులాసా?' అని అడిగారు ప్రత్యుత్తరం ఇవ్వడంలో దీటైన ఆత్రేయ — 'కు' కొట్టెయండి అంతా 'లాసే' అన్నారు

* * *

పేజీలో సగానికి మడిచి మాటలు రాయించడం ఆత్రెయ అలవాటు ఆ అలవాటుని చూసి సినీరచయిత తోటపల్లి మధు 'పేజీలో అర్థ భాగమే రాస్తున్నా రేమిటి?' అని అడిగారు

'మాటలు అర్థవంతంగా వుండాలన్నారు కదా అని పెజీలో అర్థభాగమే రాస్తున్నా' అన్నారు సమయస్ఫూర్తికి మారు పేరైన ఆత్రేయ

* * *

కారులోనూ, ఆటోలోనూ ఎప్పుడూ ఎడమవైపునే కూర్చోవడం ఆత్రేయ అలవాటు ఆ అలవాటుని ఎవరైనా ఆత్మీయులు ప్రశ్నిస్తే —

'నేను లెఫ్టిస్టని' అనెవారు ఆత్రేయ

* * *

ఆత్రేయను ఎవరైనా ఓల్డ్‌మేన్ అంటే ఒప్పుకునేవారు కాదు

'నేను మనసుకవిని నాకు ముసలితనం లేదు' అనేవారు

'మీరు ఓల్డ్ జనరేషన్‌కు చెందినవారు కదా, వయసును ఒప్పుకోవడం వల్ల మీకొచ్చే నష్టం లేదు 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అన్నారు కదండీ' అన్నారు ఒక నిర్మాత

ఆత్రేయ వెంటనే 'బట్ గోల్డ్ ఈజ్ నెవర్ ఓల్డ్' అన్నారు

* * *

"మీరు సుఖపడకూడదండీ" అన్నాడు ఒక మిత్రుడు

'ఏం?' అన్నాడు ఆత్రేయ

"కష్టాలు అనాథలైపోతాయి" అన్నాడతను

"అదీ నిజమేనేమో!' అనుకున్నాడు ఆత్రేయ!

* * *

ఆత్రేయ ఉవాచ

"మహాభాగ్యమే ఆరోగ్యం"

"చావంటే నాకెందుకు భయం? — నే నుండగా అది రాదు — అది వస్తే నే నుండను"

"నా పాటల్లో కొన్ని సినీ గేయాలు — మరి కొన్ని మనీ గేయాలు"

"నేను డిక్టేటర్ని — పాటలు డిక్టేట్ చెస్తాను"

"బాగా ఎవరైనా బ్రతకొచ్చు — బాగా చావడం అదృష్టం"

"ఆత్మకథ ఎప్పుడూ సశేషమే — పూర్తయితే అదీ విశేషం"

---

మదరాసులో 1967 లో ప్రముఖ సాహితీ మూర్తులు కొంతరు 'సారస' అనే సాహితీ సమాఖ్య స్థాపించారు దానికి జస్టిస్ పి వి రాజమన్నారుగారు అధ్యక్షులు, చల్లా రాధాకృష్ణశర్మ గారు కార్యదర్శి వారు 'సారస వ్యాసావళి' పేర బులెటిన్స్ ప్రకటించేవారు 1967 ఆగస్టులో వెలువడిన ఒక బులెటెన్‌లో యీ వ్యాసం అచ్చయింది అంతకు ముందు దశాబ్ద కాలంలో తెలుగు నాటక రంగం గురించి ఆత్రేయ ఇందులో చర్చించారు — సం॥

# పదేళ్ల పాటు . . .

నా పుట్టిల్లు నాటకరంగమైనా అత్తిల్లైన సినిమారంగానికి వచ్చి పద్దెనిమిదేళ్ళయినవి ఆ కొత్తలో అడపదడపా పండగా పబ్బానికి పుట్టింటికి వెళ్లేవాణ్ణి అదీ పదెళ్ళుగా అసలు లేదు ఈ పదేళ్ళనే నేను 'ఇటీవల'గా నిర్వచించుకొని సింహావలోకనం చేస్తాను

అత్తింట కాపురం పెట్టిన అల్లుడు ఎంత చెడిపోతాడో అందరికి తెలుసు పదేళ్ళుగా నాటకరంగంవైపు కన్నెత్తి చూడని నన్ను 'ఇటీవలి నాటకాల తీరు తెన్నుల' గురించి అభిప్రాయం - తీర్పు చెప్పమని ఆదేశిం చారు మిత్రులు నా కందుకు అర్హత లేదనుకోవడం వారి విచక్షణను అను మానించి అవమానించడం అవుతుంది - గనక అర్హత వున్నదనుకునె ముందుకు వెళ్తాను

నాటకం - జీవిత నాటకం - జగన్నాటకం ఈ మూడింటిని నాటక మనే అన్నారు అంటే ఈ మూడూ ఒకదాని కొకటి అద్దం ఒకటి మరొక దానిలో చూచుకొంటూ కనపడుతూ వుంటుంది అంచేత ఈ మూడు నాట కాల సంగతి కాస్తో కూస్తో తెలిస్తెగాని అసలు నాటకం తీరుతెన్నులు తెలుసు కోలేమని నా మతం ఈనాడు మన నిత్యజీవితంమీద అంతర్జాతీయ ప్రభావా లెన్నో ముద్ర వేస్తున్నవి అది సాహిత్యానికీ అవశ్యం ఇలా తరిచి చూడగా తేలే సారాంశం ఒక్క ముక్కలో చెప్పాలంటే - నేడు - మన దేశంలో - దేశ దేశాలలో - మానవ జీవితంలో - గోచరిస్తూన్న అస్పష్టత, అయోమయత, తప్పించుకు తిరిగె తత్వం, తాత్కాలిక వినోద వాంఛ, అన్ని నాటకాలలో కూడా స్పష్టంగా కనిపిస్తున్నవని నా అభిప్రాయం, ఇందుకు కారణాలు పరిశీలించాలి ఆ పరిశీలన ప్రస్తుతం మన దేశానికె పరిమితం చేసుకుందాం

స్వాతంత్ర్యం రాకపూర్వం మనకు ఒకటె సమస్య - బానిసత్వం! ఆ తరువాత మనకు వచ్చేన్ని సమస్యలు అసలు స్వాతంత్ర్యమే ఒక పెద్ద సమస్య అయిపోయిందేమో

దేశంలో, జీవితంలో, సమస్యలంటూ వుంటే అవి కవి కలంలో కంఠంలో మారుపలకాలి కవితగానో - నాటకంగానో!

ఇక్కడ ఒక చిన్న ప్రశ్నకు రపీమని జవాబు చెప్పేస్తే తీరిపోతుంది. 'సమస్యల కోసమేనా కవిత్వం' అంటే - 'అవును' అని ఖచ్చితంగా చెప్తూ, ఎవరు, ఎప్పుడు, ఏ సమస్యా లేకుండా ఏం వ్రాసారో చెప్పమని సవాలు చేస్తూ ఆ వాదం ముగిస్తాను

సమస్యలంటూ వుంటే కవి కంఠంలో మారుపలకాలి అన్నాను కదూ మరి నాటక రచయిత కంఠంలో అలా పలికిందా! ఎప్పుడు? ఎన్నాళ్లు? ఇప్పుడూ పలుకుతుందా? కాస్త తిరిగేసి చూద్దాం (నాటక రచయిత కవి కాడంటారా? కాకపోతే పోనీండి)

చూద్దామంటే చూద్దాం అంటే అదేమంత తేలిక పనికాదు ఇటీవల తెలుగులో నాటక రచయితలు చాలామంది వెలిసారు నాటకాలు కోకొల్లలుగా వ్రాసారు కొత్త కొత్త ప్రయోజనాలు, ప్రయోగాలు ప్రయత్నించారు

ఇలా వుండగా 'మాకో మంచి నాటకం వ్రాసివ్వండి' అంటూ మంచి నాటకాలు లేక చస్తున్నాం' అంటూ కొందరు - ముసలమ్మను పట్టుకు వసంతాలాడినట్టు Ford car runs on its old pestige అన్నట్టు నా వద్దకు వస్తారు అర్థిస్తూ వారి అభ్యర్థనలో నిజం నిజంగా అంతేనా అనికూడా ఆలోచించాలి

నే నిటీవల నాటకాలు వ్రాయకపోయినా, ఇటీవలి నాటకాలు దాదాపు చాలామటుకు చదివాను, కొన్ని చూచాను

నిజంగా మంచి నాటకాలు లేవా! వున్నవి కాని కొందరు కోరే ఆ 'మంచి' ఏమిటి?

కొన్ని నాటకాలు చూస్తున్నంతసేపూ 'నే నింక నాటకాలు వ్రాయగలనా? వ్రాసినా ఇంత బాగా వ్రాయగలనా' అనిపించింది నాకు కానీ అవే నాటకాలు చదివినప్పుడు 'ఏదో లేదు' అనిపించింది ఈ అనిపించడానికి కారణం ఏమిటి?

స్థూలంగా నాకు రెండు కారణాలు కనిపించినవి ఒకటి—నాటకంలో సినిమా' అనుకరణ ఎక్కువ కావడం రెండు - నాటకంలో పాత్రలు సమాజంలోని సజీవ వ్యక్తులు కాక, రచయిత సృష్టించి, అతని 'విసురుల'కు

'చెణుకుల కు ,సాధనాలుగాపని చేసేవి కావడం - ఈ రెండు కారణాలకు మూలం - నేను ముందే మనవిచేసిన అస్పష్టత - అయోమయత! కనుక మూలకారణానికి కారణం వెతుకుదాం

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత - మనకు బోలెడు సమస్య లెదురైనవి చెప్పవలసినవి, అడగవలసినవి చాలా కనిపించాయి హిందూ ముస్లిం సఖ్యత, నిరుద్యోగం - బ్లాక్‌మార్కెట్ - అవినీతి - లంచగొండితనం - ఎన్నికలు ఇత్యాది ఎన్నో! ఈ సమస్యలు పుష్టివంతమైన కథావస్తువులై చాలా నాటకాలు వచ్చాయి అప్పట్లో నాటక రచయితకు కడుపునిండిన బోజనం! కానీ కొంత కాలానికి - అంటే దాదాపు రెండవ జెనరల్ ఎన్నికలయ్యేసరికి ఇవన్నీ అంతర్ధానమైనవి అనగానె పరిష్కారమైపోయినవని పొరబాటున అనుకునేరు ఇవి మన జీవితాలలో ఒక భాగంగా ఇమిడిపోయినవి వాటితో మనం కాపురం చేయడానికి అలవాటు పడిపోయి, అవి మనకు ఆప్తబంధువులుగా తయారైపోయినవి అవి సమస్యలుగా కనిపించడం మానేసి సహజమైనవిగానూ, సర్వసామాన్యమైనవిగానూ రూపొందినవి అప్పుడే ఏర్పడ్డది నేనన్న అయోమయ స్థితి రచయితకు ఏం వ్రాయాలి అన్నదే పెద్ద సమస్యగా ఎమరైంది వ్రాయడమనేది ఒక పెద్ద ఒబ్బు దానికి ఉపశాంతి ఎప్పుడూ ఏదో ఒకటి వ్రాస్తూండడమే కనుక ఏం వ్రాయాలన్నది సమస్యే అయినా ఏదో ఒకటి వ్రాయాలన్నది అవశ్యవ్యసనం అయిపోయింది ఆ వ్యసనాన్ని తృప్తి పరచుకునెందుకు రచయిత 'తప్పించుకు తిరిగే తత్వం' 'తాత్కాలిక వినోదం' అలవాటు చేసుకున్నాడు ఈ బాధ నాటక రచయిత కున్నంతగా పద్య గెయ కవులకు లేదు శ్రీశ్రీ మొదలు - నెటి అతినవ్య దిగంబర కవుల వరకు, ఆనాటి 'ఆకలి' 'కుళ్లిన ఎముకలు' 'దగాపడిన తమ్ముళ్ళు' ఇత్యాది వస్తువులనె వేరే వేరే మాటల్లో, మూసల్లో మనకు వినిపిస్తున్నారు కానీ నాటక రచయిత అలా చెయలేడు కారణం - చదువరులకు ప్రేక్షకులకు వున్న తేడా - చెవికీ కంటికీ వున్న శక్తి వ్యత్యాసమే అంచేత నాటక రచయిత అడ్డుదారులూ, అడ్డమైన దారులూ తొక్కవలసి వచ్చింది

ఆ దారులన్నిటిలో భయంకరమైనది ప్రమాదకరమైనదీ 'ఖూనీకోరు' నాటకాలు - క్షమించాలి - 'డిటెక్టివ్' నాటకాలు - లేక అపరాధ పరిశోధక నాటకాలు నాటకాలకన్నా నవలా సాహిత్యంలో యీ ఇతివృత్తాలు - బలమైన స్థానాన్ని - ఆక్రమించుకొన్నాయి వీటి విషయానికి తరువాత వస్తాను-

రెండవది—స్త్రీ స్త్రీని వివిధ కోణాలనుంచి పరిశీలించి చిత్రించటం రచయిత చేసిన రెండవ పని ఇదివరకున్న పడుపువృత్తి పోయి - దానిస్థానే రకరకాల మానసిక-శారీరక వ్యభిచారాలు తల లెత్తినవి మానసిక దౌర్బల్యం వల్ల కాలుజారిన మగువ - మనసొకరి కిచ్చి తను వొకరి కిచ్చిన ఇల్లాలు - వివాహానంతరం - కుండ మార్పిళ్ళులాగా - భార్యలను మార్చుకున్న భర్తలు - వీటిలో కాంప్లికేషన్లు - నాటక రచయితకు వస్తువులైనవి మనుష్యు లెంత మారినా - సమాజంలో ఎన్ని అవకతవక లున్నా, ఆడదాన్ని పతి వ్రతగా తప్ప వేరే విధంగా చూడడం ఇష్టపడని భారతీయులలో, ఏ కొద్ది మంది మేధావులకో తప్ప - సామాన్యజనానికి నాటకా లట్టే రుచించలేదు అందుచేత ప్రజాదరణ పొందలేదు

అంతగా పొసగకపోయినా ఇక్కడ ఒక్క విషయం చెప్పకతప్పదు 'ప్రేమ' మన ప్రాచీన సాహిత్యంలో ఎక్కడా వినరాదు అది మనం విదేశం నుంచి దింపుకొన్న ఒక మత్తుపదార్థం మనకున్నది, మన పూర్వీకు లెక్కు వగా పాటించి, చాటించినది 'ధర్మం' ధర్మకర్మబద్ధులం మనం అలాంటి మన సమాజంలో ఈ ప్రేమ ప్రవేశించి, ఎన్నో విపరీతాలకు దారితీసింది మరీ సినిమాలలో - వాటి ననుసరిస్తూన్న నాటకాలలో యీ ప్రేమ - వీర విహారంచేస్తూ, ఏకచ్ఛత్రాధిపతిగా ఏలుతూ - కుర్రవాళ్ళను వెర్రివాళ్ళను చేస్తూందేమోనని నా భయం ఈ మాటంటే నన్ను సనాతనుడు, ఛాందసుడు అని జమకడతారేమో, పర్వాలేదు

ఈ దశలోనె పైనచెప్పిన రెండుదారులకు అనుగుణంగా వున్న అమె రికన్ సాహిత్య అనుకరణలు, అనువాదాలుగా కొన్ని నాటకాలు వెలసినవి

వస్తువు సహజము, సామాజికము, సర్వజనీనము కానప్పుడు దానికి కృత్రిమాలంకారాలు, ముస్తాబులు, ముసుగులు అవసరమవుతాయి అందులో సినిమా అనుకరణ ఒక ముస్తాబు నాటకంలో అది కొన్ని సమయా లలో అందంగానూ, రసస్ఫోరకంగానూ వున్నా, చాలాసార్లు, చాలామటుకు నాటకంలో నాటకీయతను దెబ్బ తీస్తుందని చెప్పకతప్పదు దీనికి ఋజువు ఆ ముస్తాబులు కొట్టవచ్చినట్లు కనపడడమే జుట్టున్నమ్మ ఏ కొప్పు పెట్టినా అందమే లేనప్పుడు కనపడిపోతుందిగా అంతే

ఇక నాటక రచయిత ప్రయత్నించిన రెండవ ముస్తాబు - అందమైన ముసుగు సంభాషణల జిగితో సన్నగావేసిన జరీముసుగు అది ఇటీవలి నాట

కాల సంభాషణలలో చాతుర్యము, విసురులు, చెణుకులు విరివిగా విన వస్తున్నవి ఇవి వినోదజనకంగా వున్నవి కానీ వీటిలో ఎక్కువపాలు నాటక కథావస్తువునకుగానీ, కథాకథనానికిగానీ, కథలో పాత్రలకుగానీ, సంబంధము, అవసరము లేనివిగానె వున్నవి రచయిత విజ్ఞానాన్ని, వివిద విషయాలపై అతనికున్న అబిమాన అయిష్టతలను వెల్లడిచేయడానికె అన్నట్లున్నవి. తాత్కాలికంగా ప్రేక్షకులను నవ్విస్తూ చక్కిలిగింతలుపెడుతూ, గబుక్కున అక్కడక్కడ కద చెప్పేస్తూ నాటకప్రదర్శనకాలాన్ని హాయిగా గడిపేందు కుపకరిస్తున్నవి నాటకప్రయోజనం అంతమాత్రమే అయితే ఆ రచయిత లందరూ సిద్ధసంకల్పులే అంతకన్నా ప్రయోజనం ఇంకేదో వుందనుకుంటే యీ సంబాషణలన్ని అజాగళస్తనాలే అవుతాయి

మరొక ముఖ్యాంశం - తెలుగు నాటకాలలో తెలుగుదనం మృగ్యం కావడం - అసలు తెలుగుజాతిలోనె జాతీయత కొరవడిపోతుందేమో! ఒక నాటి తెలుగు పండుగలు, వేడుకలు - వినోదాలు - ఈనాడు - వుండవలసిన పల్లెటూళ్ళలోనే అదృశ్యమైపోతున్నవి జాతికి నిలువుటద్దమేగా నాటకం, కనుక బాధపడి లాభంలేదు

రాజకీయంగా, సాంఘికంగా ఒక స్తబ్దత ఏర్పడ్డరోజులివి అదె స్తబ్దత నాటకాలలోకూడా ప్రతిబింబితమవుతూంది

సమస్యలూ - బోలెడన్ని - అన్నీ అలాగే వున్నవి - ఇంకా అద్వాన్న మైనవేమోకూడా సాధించవలసిన అభ్యుదయమా - ఒక్కడుగు ముందుకు సాగలేదు సరికదా - కాస్త వెనక్కె వెళ్లిందేమో దీనికంతటికీ కారణం మధ్య తరగతి ప్రజ - అందులో మేధావులు ఎప్పుడు ఏ అలజడి చేసినా, ఏ ఎలుగు వినిపించినా, ఏ పిలుపు వచ్చినా మధ్యతరగతి నుంచే వచ్చింది, రావాలి ఆ మధ్యతరగతి కిప్పుడు 'అరిచె కుక్కకు కవళం'లాగా కొన్ని అవకాశాలు యీ పరిపాలనా యంత్రం కలగజేస్తూంది వెయ్యి మొదలు పదివేల వరకు ఎంతమాత్రం డబ్బున్నాచాలు - ఏ చిన్న పర్మిట్టొ - లైసెన్సో సంపాయించి - మెల్లమెల్లగా మద్యతరగతి మనిషి పైతరగతిలోకి వెళ్లి పెట్టుబడిదారై కూర్చునె అవకాశాలు - చాలా ఏర్పడ్డాయి ఆ మత్తులో పరుగెత్తుతూన్న మధ్యతరగతి మనిషికి, మొన్ననే రిపేరైన రోడ్డు నెడు గతుకులు పడివున్నా, కాళ్ళు కొట్టుకున్నా, అందులో కాంట్రాక్టరు గడించిన డబ్బే కనిపిస్తుంది గానీ - అందులో అవినితి, అరాచకత్వం కనిపించదు - కనిపించినా పట్టించు

కోడు - తన పరుగు తనదే ఇది చాలా ముఖ్యమైన కారణం నాటకాలను గురించి చెప్పమంటే నేను రాజకీయాలు చెప్పాను అప్రస్తుతం కుంటాను అయితే క్షమించండి

మొత్తంమీద జాతిని వీపుమీద చరిచి - కదిలించి వురికించే ఒక ప్రయత్నం జరగాలి ఆ పని నాటక రచయిత అందరికన్నా సులభంగా, సున్నితంగా చేయగలడు సినిమా ప్రభావంలోపడి - వికారాలను అందాలుగా దర్శిస్తూ, తీయనైన అబద్ధాలకు అలవాటుపడిపోయిన జనాన్ని తనవైపు మళ్లించుకోవడం - తనమాట వినిపించడం - తన వెనుక నడిపించడం నాటక రచయితకు కష్టమైనపనే - కానీ అసాధ్యం కాదు అందుకు ముందు తా నా వాతావరణం నుంచి బైటపడాలి

ఈనాడు తెలుగులో సిద్ధహస్తులు, సిద్ధప్రతిష్ఠులు అయిన నాటకకర్తలను - వారి నాటకాలను కొన్నిటినైనా ప్రస్తావించక యీ సమీక్ష సంపూర్ణము సమంజసమూ కాదు

నా దృష్టిని ఆకర్షించిన రచయితలలో —— శ్రీ భమిడిపాటి - శ్రీ ప్రఖ్యా శ్రీరామమూర్తి, శ్రీ యన్ ఆర్ నంది, శ్రీ గొల్లపూడి మారుతిరావు - ముఖ్యులు ఈ నలుగురూ నాలుగు కోవలకు త్రోవలకు చెందినవారు

భమిడిపాటిది ఒకరకంగా వారసత్వము! ఆయన నాటకాలలో చాలా వరకు సజీవమైన పాత్రలు - తెలుగువాళ్ళు వుంటారు 'కీర్తిశేషులు' నాకు నచ్చిన నాటకం నాలుగు కాలాలపాటు నిలిచేదీ! అందులో కవి ఒకప్పటి నేనూ ఆయనా - ఇంకా చాలామంది మిగిలిన పాత్రలు కూడా ప్రతికవీ ఎరిగినవే కాకుంటే అక్కడక్కడ నాటకాన్ని బిగించడంకోసం - కొంత అతిశయోక్తికి వెళ్లేరేమోనని నా అనుమానం

ఇక 'ప్రఖ్యా' అంటేనే నాకు భయం ఆయన 'పణి' ఎప్పుడూ నా కళ్లెదట పడగవిప్పి బుసకొడుతూన్నట్టే వుంటుంది నాటకం నడపటంలో నెర్పు, సంభాషణలలో చాకచక్యం - చురుకుదనం - అన్ని లక్షణాలు వున్నవి కాకుంటే నా Complaint ఒక్కటే ఆయన కలం ఎప్పుడూ డిటెక్టివ్ Element నే ఏరుకొంటుంది ఆ దారి తప్పిస్తే మంచిదని నా సలహా ఎందుకంటే Crime Subjects వినోదమూ కాదు - విజ్ఞానమంతకన్నా కాదు పొరబాటైతే మన్నించాలి

యన్ ఆర్ నంది మరో 'మొహంజొదారొ' ఒక విశిష్ట సృష్టి ఇందులో అవలంబించిన టెక్నిక్ ఆ ఇతివృత్తానికి ఎంతో చక్కగా అతికిపోతుంది ఈ సృష్టికి ఆయనకు నా ప్రత్యేక అభినందనలు

గొల్లపూడి మనిషి ఎంత పలచగా వుంటాడో మనసంత పెళుసుగా మాట్లాడుతుంది అవసరమైనప్పుడు ఎప్పుడూ నవ్వుతూవుండే ముఖం ముసుగున ఎప్పుడో ఎక్కడో నలిగిన హృదయాలు - కురిసిన కన్నీళ్ళూ పలుకుతూ పలకరిస్తూవుంటాయి ఆయన రాగరాగిణిలో మూగబాధలు ముద్దుగా ముద్దగా ముసురుకొని వుంటాయి రేడియో గడియార జీవితం ఈయన కలానికి కళ్లెంవేస్తుందేమోనని నా భయం లేకుంటే వూరుక్కునేవాడు కాడు

స్థలాభావం - కాలాభావంచేత ఈ నలుగురినె ప్రస్తావించాను ఇతరులు నొచ్చుకోకూడదు

వీళ్ళు వాళ్ళూ అనేమిటి - యువకరచయితలందరూ - నా విమర్శను సహృదయంతో స్వీకరించి - నిద్రాణమై - నిస్సారమై పోతూన్న తెలుగు నాటకరంగానికి సరిక్రొత్త కలం కొరడాలతో - మేలుకొలుపులు పాడి ముందుకు ముందుకు వురకలు వేయించాలని నా కోరిక - విన్నపం అందుకు నా సమీక్ష వుపకరిస్తే సార్థకమవుతుంది

ఆత్రేయ రచించి, దర్శకత్వం వహించిన ఒకే ఒక టి వి రూపకంలోని పాటలూ - సినిమారంగానికి రాకపూర్వం, అంటే నలభైఏళ్ళ క్రితం, ఆయన వ్రాసిన ప్రేమగీతాల నమూనాలూ - ఆయనె నిస్పృహతో చించిపారేసుకున్న 'డాక్టర్ కోట్నీస్' నాటకంలోని పాటలూ - ఈ శీర్షికలో విశేషాలు —సం॥

# పిల్లలతో చెలగాటం
# పెద్దలకే ఇరకాటం

దాదాపు ఇరవై సంవత్సరాలక్రితం ఆత్రేయ సొంత సినిమా తీయాలని 'చిన్నారి మనసులు' అనే ఒక బాలల చిత్రానికి స్క్రిప్ట్ తయారు చేసుకున్నాడు కాని అది సాధ్యపడలేదు 1988 లో దానిని కొన్ని మార్పులు, చేర్పులూ చేసి 'పిల్లలతో చెలగాటం పెద్దలకె ఇరకాటం' అనే పేరుతో, తన దర్శకత్వంలో, టి వి రూపకంగా నిర్మించాడు అది దూరదర్శన్, హైదరాబాదు కేంద్రంనుండి పదమూడు భాగాలుగా ప్రసారితమైంది దూరదర్శన్ సౌజన్యంతో అందులోని పాటలుమాత్రం అందిస్తున్నాం — సం॥

1

పిల్లలతో చెలగాటం
పెద్దలకె ఇరకాటం
జాగ్రత్తండోయ్ జాగ్రత్త
తస్మాత్ జాగ్రత్త ।పిల్ల।

పిల్లలు పెద్దల కద్దాలు
కనిపిస్తాయి వాళ్ళలో మీ ముఖాలు
మీరు అచ్చాగుంటే వాళ్ళూ అచ్చాలు
మీరు లుచ్చాలైతే వాళ్ళూ లుచ్చాలు ।జాగ్ర।

పిల్లలు శుక్లపక్ష చంద్రుళ్ళు
దినదినమూ పెరిగే వెన్నెల్లూ
వెన్నెలకే మసి పూసారంటే
వంశానికి మచ్చలు తెస్తారు ।జాగ్ర।

## 2

అనగనగా ఒక ఊరు
అది మీ ఊరు - మా ఊరు
ఏ వూరైనా పల్లెటూరు
ఏ వూరైనా పల్లెటూరు

పాలు పెరుగు అమ్మేస్తారు - అయ్యోరామ
పట్నం నెయ్యి కొని తెస్తారు
ఉన్న పనులు మానేస్తారు
ఉద్యోగాలకు ఎగబడతారు
అది ఏ వూరైనా పల్లెటూరు ।అన।

చిన్నారి మనసుల చిన్నోళ్ళు
పైలాపచ్చీసు కుర్రాళ్ళు
చింత చచ్చినా పులుపు చావని ముసలాళ్ళు
అంతా మనవాళ్ళు
అది ఏ వూరైనా పల్లెటూరు ।అన।

పంతులొకడు - భగవంతుడొకడు
బడిలో గుడిలో వుంటారు
సదివినోళ్ళు శానామంది - అయ్యో
మనసెరిగినోళ్ళనె ఎతకాలండీ
అది ఏ వూరైనా పల్లెటూరు ।అన।

## 3

కోతిపిల్లకు పెళ్ళి చూపుల్రోయ్
కొండముచ్చుకు పెళ్ళిచూపుల్రోయ్

పిల్లకేమోయ్ - పిచ్చిదనేకదా
బాబోయ్ బాబోయ్ బాబోయ్ బాబోయ్

పెళ్లిచెస్తే పిచ్చి పొదా - చేసేయ్
మోసేయ్ మోసేయ్ మోసేయ్ - బాబోయ్ ।కోతి।

నవ్వుతుంది చలాకిగా - (గుర్రం అరుపు)
పాడుతుంది హుషారుగా - (గాడిద అరుపు)
మాటాడుతుంది బలే మజాగా
మ మ మ మ మజాగా
చెసెయ్ మోసేయ్ మోసేయ్ మోసేయ్ ।కోతి।

పిల్లా కుంటిదంటావా
ఆఁ ఛఛ ఒక్క కాలే
ఆఁ ఒహో గుడ్డిదా
ఊఁ ఛీఛీ కన్ను లొట్ట
ఒరెరె గొక్కపల్లా ??
అబ్బే కోరలున్నాయి - ఓహో
కుక్కపిల్ల - నక్కపిల్ల - బర్రెపిల్ల - గొర్రెపిల్ల
మేకపిల్ల - కాకిపిల్ల - ఆ పిల్ల - ఈ పిల్ల
పిల్ల పిల్ల పిల్ల పిల్ల పిల్లోయ్ - బాబోయ్ ।కోతి।

## 4

సాకీ తమ్ముడూ !
నీ గుండె రగిలిపోతున్నది
నా గుండె పగిలిపొతున్నది
పల్లవి ఎంత పని జరిగింది తమ్ముడూ
ఏం చెస్తే తీరుతుంది ఇప్పుడూ ।తమ్ము।

చరణం నెను మి నాన్నను చంపాను
నువ్వు నన్ను రాయితో కొట్టావు
చంపలేకపోయావా తమ్ముడూ
నన్ను చంపలేకపోయావా తమ్ముడూ
ని కడుపుమంట తీరేదీ అప్పుడూ ।ఎంత।

ఒక్కటే అబద్ధం చెప్పాను
నిన్ను దిక్కులేని వాడిగా చేసాను
దిక్కులేని వాళ్ళకు దేవుడే దిక్కట - తమ్ముడూ
ఆ దేవుడే నన్ను శిక్షిస్తాడు
నిన్ను రక్షిస్తాడు ॥ఎంత॥

5

మనిషీ ! ఓ మనిషీ !!
యుగయుగాలుగా - తరతరాలుగా
మంచిని వంచించినది - హింసించినది
నువ్వు - నువ్వు - నువ్వే ॥మని॥

ప్రేమించండి - సేవించండి
జీవించండని బోధ చేసినాడని
ఏసుక్రీస్తును శిలువకు ఎక్కించిందెవరు
నువ్వు - నువ్వు - నువ్వే ॥మని॥

నలుపు తెలుపు తేడాలన్ని
శరీరానికే మనసుకు లేవనీ
మానవులందరు ఒక్కటేననీ
సమతను చాటిన లింకనును
కాల్చి చంపిందెవరూ
నువ్వు - నువ్వు - నువ్వే ॥మని॥

స్వాతంత్ర్యం మన జన్మహక్కని
సత్యాగ్రహమే దర్మపథమనీ
బానిస జాతికి బందవిముక్తిని
ప్రసాదించిన బాపూజీని
కాల్చి కూల్చినదెవరూ
హేఁ రామ్ హేఁ రామ్

రఘుపతి రాఘవ రాజారామ్
పతిత పావన సీతారామ్

## 6

ఏం చెప్పాలి - ఈ
మనుషులకేం చెప్పాలి
అబద్ధమా - నిజమా
వాళ్ళకు నచ్చిన ఏదమా ।ఏం।

నిజం చెప్పమని ప్రతి ఒకరూ
నీతిని తామే బోధిస్తారు
ఉన్న నిజం చెప్పామంటే
ఉలికి ఉలికి పడతారు
ఉడికి ఉడికి కొడతారు ।ఏం।

సత్యం దైవం అంటారు
సత్యం ధర్మం అంటారు
దైవం కలదని - ధర్మం కలదని
నమ్మి సత్యమే చెప్పినప్పుడు
మండి మండి పడతారు
మనుషులు రాక్షసులౌతారు ।ఏం।

---

# అ(తి)పూర్వ గీతాలు

ప్రసిద్ధ సినీనటి శ్రీమతి జి నిర్మల 1948 - 49 సంవత్సరాలలో ఆత్రేయ దర్శకత్వంలో, ఆయనతో కలిసి, చాలా నాటకాల్లో నటించింది అప్పట్లో ఆత్రేయ వ్రాసిన కొన్ని పాటలు ఆమె స్మృతిపథంలో ఇంకా చెరగకుండా నిలిచిపోయినై వాటినామె భద్రంగా మాకు అప్పగించింది ఇవి ఆత్రేయ వ్రాసిన ఆనాటి ప్రణయగీతికలు —— సం॥

## 1

ఆనాటి ని మాట మరచిపోయావా!
ని రూపు నాలోన నిలిపి పోయావా!
విశ్వమంతా వెలుగు వెన్నెల్లో వెతికాను,
కళ్ల నోడించేటి చీకట్లో పిలిచాను,
వినపడదు నీ మాట - కనపడదు ఏ రూపు
వేసారి నాలోకి వెర్రిగా చూశాను!

ఆ నాటి నీ మాట మరచిపోయావా!
ని రూపు నాలోన నిలిపి పోయావా!

## 2

విహరించని నన్ను విశ్వమంతా చెలియ!
బంధింపకే నన్ను అనురాగ బంధాల! ।విహ।

ఒపనె సంకెళ్ల - ఆగలే నొకచోట
ప్రొద్దుకుంకే దిక్కు పోయి చూడాలి ।విహ।

చుక్కల్లు మెరిసేటి చోట్లన్ని తిరగాలి
నను కన్న నా దేశమును చూసి రావాలి ।విహ।

"డాక్టర్ కోట్నీస్" నాటకంలో ఆత్రేయ "కోట్నీస్" పాత్ర నటించేవాడు ఆయన చైనీస్ భార్య "చింగ్‌లాన్" పాత్రను శ్రీమతి నిర్మల నటించింది ఆ నాటకం ఇప్పుడు మనకు దక్కకుండా పోయినా, అందులోని రెండు పాటలు మాత్రం — శ్రీమతి నిర్మల పుణ్యమా అని మనకు లభించాయి వీటిలో మొదటిది "చింగ్‌లాన్" సైనికులను ప్రబోధిస్తూ పాడేది, రెండోది డాక్టర్ కోట్నీస్ అంతిమ ఘడియల్లో భర్తనూ బిడ్డనూ ఉద్దేశించి ఆమె పాడే వేదనాగీతం — సం॥

1

పరసుఖమునకై బ్రతుకంతాను
హారతి పట్టే అనాథలారా!
లేవండోయ్! లేవండోయ్!
రారండోయ్! రారండోయ్! ।పర।

ప్రపంచమే ఒక ముళ్లకంపగా
బ్రతుకంటే ఒక రాతి రథముగా
లాగుచు లాగుచు, మూలిగి మూలిగి
శ్రమించి చచ్చే శ్రామికులారా!
ద్రవించిపోయే ధార్మికులారా!
లేవండోయ్! లేవండోయ్!
రారండోయ్! రారండోయ్! ।పర।

ఆకలి మంటలు జన్మహక్కుగా
చీకటి శోకము స్థిర చరాస్తిగా
ఆశలు లేక, ప్రాణము పోక
కృశించిపోయే కర్షకులారా!
నశించిపోయే మానవులారా!
లేవండోయ్! లేవండోయ్!
రారండోయ్! రారండోయ్! ।పర।

## 2

కలతలేని చిరుత నవ్వు
కదలియాడు కనులలోన
మెరసిపోయె సామ్య జగతి
హాయిగాను నిదురపో!
నిదురపో, నిదురపో!

నేటి వీర త్యాగఫలము
భావి యువక భాగ్యరేఖ
మరచిపోదు చరిత నిన్ను
చల్లగాను నిదురపో!
నిదురపో! నిదురపో!

---